# ప వి త్రు లు

[ దృ శ్య నా టి క ]

రచన :

ధనికొండ హనుమంతరావు

ప్రచురణ :

సుందరరాం అండ్ సన్సు., తెనాలి.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

శేషు అండ్ కో., తెనాలి.

# I

[రావుబహద్దూర్ రామారావు పంతులు గారి మేడలోని ముందరిహాలు.
హాలు విశాలంగా, శుభ్రంగా వుంది. రెండు, మూడు ఫ్రేంకుర్చీలూ, రెండు సోఫాలూ, రెండు యీజీ ఛైర్లూ ఉన్నవి. సీలింగ్ ఫాన్ మెల్లిగా తిరుగుతోంది. సింహద్వారంనుంచి ఒక సన్నని తెర వేలాడుతోంది. హాలుకు మధ్యన ఒక టేబిలూ, దానిపైన ఫ్లవర్ పాట్ అమర్చబడి ఉన్నవి. కింద మంచిరకం తివాసీ పరచబడివుంది. తెల్లని గోడలమీద రకరకాల బొమ్మలూ వేళ్ళాడుతూండటంవల్ల యీ ఇంట్లోని వ్యక్తుల అభిరుచుల్ని మనం సరిగ్గా గ్రహించలేకపోవచ్చు. కాని, హాలులో వేళ్ళాడే ట్యూబులైట్ నుపట్టీ, మిగతా ఫర్నిచర్ను చూసీ, ఇది స్థితి మంతుల ఇల్లని తేలిగ్గా గ్రహించగలం.
గోడగడియారం ఆరుగంటలు కొట్టింది, హాలులోకి జొరబడే నీరెండను పట్టి - ఇది సాయంకాలమని చెప్పవొచ్చు. హాలులో రావు బహద్దూర్ గారి ద్వితీయ కళత్రం సుందరమ్మ సోఫాలో కూర్చొని వార్తా పత్రికను పఠిస్తోంది. ఆమె వయస్సు దాదాపు నలభై ఏళ్ళవరకూ వున్నా - అంత పెద్దదిగామాత్రం కనిపించటం లేదు. ఈడునుపట్టి నలిగే వాళ్ళ జాతితాలో సుందరమ్మకు స్థానం లేదు. ఆమె ఫాలభాగంమీది రూపాయి వెడల్పు కుంకుమబొట్టును చూసి, - ఆమెభర్త ఇంకా బతికే వున్నాడని మనం అనుకోవాలి. సుందరమ్మ రూపసికూడాను. ఆమెకు చెప్పుకోదగ్గ ఆభరణాలే ఉన్నయ్.
సింహద్వారం దగ్గిర తెర కొంచెం కదిలింది]

సుంద:— ఎవరూ ?

[జవాబులేదు. తెర సన్నటిదికనుక, - అవతల మనిషి తారెట్లాడుతూన్నట్టు తెలుస్తోంది.]

సుంద:— (పెద్దగా) ఎవరక్కడ - మాట్లాడ రేం ?

[రావుబహద్దూర్ గారు మెల్లిగా ప్రవేశించారు. సూట్లువెయ్యక పోయినా - నాగరికత తెలియనివాడ నేందుకు వీల్లేదు. నిజానికి

ఆయన, నాగరికతను ఆరాధించి, ఆరాధించి - విసుగెత్తి, చివరకు ఆడంబరంగా ఉండేందుకు మనస్సును కుదుటబరుచుకున్నాడు. కాని, ఒక్కసారిగా మారేందుకూడా కష్టమై కాబోలు - ఆ దుస్తుల్లో మాత్రం తన రావుబహద్దూర్ తనాన్నీ, తన ఐశ్వర్యాన్నీ వ్యక్తపరుచుకుంటున్నాడు. సిల్కుచొక్కా, గ్లాస్గో పంచా, చేతికి రిస్టువాచీ, మెడలో జరీఅంచుల కండువా - గమనించ తగ్గవి. వయస్సు యాభై దాదాపు ఉండొచ్చు. కత్తిరించబడ్డ మీసాలు దూరానికి నల్లగా కనిపిస్తూన్నా, దగ్గరనుంచి చూసే వాళ్లు తెల్లవెంట్రుకలు కూడా వీరి ఆస్థని గ్రహిస్తారు. నెత్తిమీది వెంట్రుకలు బాగా పలచబడ్డా, అది క్రాపుకిందనే జమవెయ్యాలి. కళ్ళకు అద్దాలూ, కాళ్ళకు కొత్తగా పాలిష్ చేసిన బూట్స్ ఉన్నవి. మనిషి పొడగరి. ఎర్రగా, బుర్రగా చూసేవాళ్ళకు బాగానే వుంటాడు. ఇవ్వాళ మాత్రం ముఖంలో కళేమీ లేదు. వ్యధతో బాధపడుతూన్నట్టు కనిపిస్తుంది. ప్రమాదమేదో తనతో తెచ్చుకున్నట్టు కలతపడుతున్నాడు.]

సుంద:— (ఆతృతగా లేచినిలబడి, నిట్టూర్చి, కూర్చుంటూ) మీరా? అట్లా తెరచాటు భాగోతంగా తారెట్లాడు తూంటే దొంగేమోననుకున్నాను. (వెంటనే దృష్టిని వార్తా పత్రికమీదికి పోనిచ్చింది)

రావు:— (వొచ్చి ఆమెకు దగ్గరగావున్న యీజీఛైర్‌లో నడుం వాలుస్తూ) దొంగలా? ఇక్కడ ఏముందని దొంగలు వొస్తారూ? వొచ్చినా, నిరాశతో వెళ్ళిపోక తప్పదు.

సుంద:— (పత్రిక కిందికిదించి భర్తముఖంలోకి చూస్తూ) ఇవ్వాళ అట్లా ఉన్నారేం?

రావు:— (బలవంతాన నవ్వుతూ) ఎట్లావున్నానూ?

సుంద:— మీకు 'రావుబహద్దూర్' బిరుదైతే వుందికాని 'రంగమార్తాండ' 'నటకాగ్రేసర' మొదలైన బిరుదులు

లేవన్న సంగతి మరిచిపోయినట్టున్నారు. ఒకవేళ పొరపాటున మీరు స్టేజీఎక్కినా— ప్రేక్షకుల్లో ఒక్కళ్ళనుకూడా మెప్పించటం—అసంభవం!

రావు:— నీ కెట్లా తెలుసూ?

సుంద:— ఇప్పుడు మీరునవ్వారు. అది నవ్వని నాబోటి తెలివి లేని ఆడదే అనుకోనప్పుడు—ఇక తెలివిగల ప్రేక్షకుల సంగతి వేరే చెప్పాలా?

రావు:— ప్రేక్షకులూ, రంగస్థలమూ, నటన నాకు తెలియని మాటైతే నిజమేకాని—ఇన్నాళ్ళూ అరవైవేల ప్రేక్షకుల ఎదుట— అంతకన్న పెద్దరంగస్థలంమీద నటిస్తూ, నూటికి తొంభైమందిని మెప్పించాను—

సుంద:— పెద్ద రంగస్థలమా? అరవైవేలమంది ప్రేక్షకులా? నటనా? మీరా? మెప్పించటమా? (పకపకా నవ్వింది)

రావు:— నవ్వొద్దు. అదంతా కోత అని నవ్వావ్! కాని అదంతా నిజం! ఇన్నాళ్ళూ ఇంత హోదాతో పరువు మర్యాదల్తో ఇంత గొప్పగా బతక గలుగుతున్నామంటే అదంతా నా నటనా చాతుర్యమే! మనకు ఉన్నదాని నిజం ఎవ్వరికీ తెలియకుండా బూటకపు మాటల్తో ఆడే నాటకంగా తయారుచేసి—ఇంతమంది ప్రేక్షకుల్ని ఒప్పించ గలిగానంటే— వెధవ స్టేజీ, వెధవ నటనా— వీటి సంగతి నాకు తెలియనే తెలియదనటం— నిజంగా సాహసం!

సుంద:— మీరు చెప్పేది నాకేమీ అర్థమవటంలేదు.

రావు:— నీకే కాదు; యీ ప్రేక్షకులనబడే వాళ్ళకెవ్వరికీ కూడా అర్థమవదు. అట్లా అర్థమైతే— ఆ ప్రేక్షకులే

నటకులై కూర్చునేవాళ్లు! అదీకాక నానటనాచాతుర్యమే కనక అర్థమైవుంటే — (బుర్రవూంచి) యీ తలమీద యీపాటికి ఒక్క వెంట్రుకకూడా ఉండేదికాదు....

సుంద:— (నవ్వి) వాటి దిగులు మీకేం అక్కర్లేదు. ఆవెంట్రుకలు వాటంతట అవ్వే ఊడుతయ్.

రావు:— ఆ ప్రకృతిని ఎవ్వరూ ఆపలేరు. కాని ఆ ప్రేక్షకులే వాటిని ఊడగొట్టివుంటే? వాళ్ళకు అర్థంకాలేదు కనుక....

సుంద:— (మధ్యలోనే అందుకొని) వాళ్లలాగే నాకూ అర్థం కాకపోయినా వింటూ కూర్చోమని ఆజ్ఞా?

రావు:— నీకు టీకా తాత్పర్య సహితంగా ఇవ్వాళ చెప్పదల్చుకున్నాను. నువ్వు ఇన్నాళ్లూ ఆ ప్రేక్షకుల్లోని వ్యక్తివే కాని— ఎల్లాగైనా నాకు డియర్ వైఫ్వు— పొరపాటు— డియరెస్ట్ సెకండ్ వైఫ్వు....

సుంద:— ఐతే థర్డ్ వైఫ్ కూడా వుందాయేమిటి— ఆగారు?

రావు:— ఎబ్బె! ఎంతమాట! ఇప్పటికి రెండుసార్లు పెళ్ళాడటంవల్ల రెండు గొప్పతప్పులు చేసిన వాణ్ణయ్యాను. ఇంకా బుద్ధిలేక మూడో పెళ్ళికూడా చేసుకొని— ఇంకోసారి కూడా అదే తప్పు చేస్తానా? అలాటిది పొరపాటున కూడా జరగదు——

సుంద:— అలవాటు ప్రకారం జరుగుతుందా?

రావు:— కాదు. గ్రహపాటు ప్రకారం అను——

సుంద:— నటకాగ్రేసరులు ఏమన్నా చెల్లుతుంది....

రావు:— (పొరపాటున లేచి నిలబడి ఉపన్యాస ధోరణిలో) నా నటనా చాతుర్యాన్ని మెచ్చుకుంటూ - నాకు లోగడ

వున్న 'రావుబహద్దూర్' బిరుదుతో పాటు 'నటకాగ్రేసర' బిరుదాన్ని కూడా ప్రసాదించినందుకు యీ సభవారికి నా ధన్యవాదాలు.

సుంద:— (నవ్వుతూ) ఇక్కడ సభేమీ లేదు సార్ !

రావు:— (చప్పున కూర్చొని) అదే. నువ్వే అనుకో.... కాని ఇదంతా 'నటన' అని అప్పుడే నీకెల్లా తెలిసిపోయిందో నాకు అర్థం కావటం లేదు.

సుంద:— ఆ సంగతికూడా తమరే సెలవిచ్చారు.

రావు:— ఆఁ. జ్ఞాపకం వొచ్చింది. ఆవిషయం భాష్యంతో సహా చెప్పబోతున్నాను.... వింటున్నావా ?

సుంద:— చెప్పండి. మీరు మాట్లాడుతూంటే వినకుండా ఉండేందుకు చెవిటిదాన్ని కాదుగా ?

రావు:— (తన చొక్కా-గుండీల్ని చూపి) ఈగుండీల్ని చూశావా ?

సుంద:— రోజూ చూస్తూనే వున్నాను.

రావు:— చూసి కూడా గ్రహించలేక పొయ్యావ్ !

సుంద:— అవ్వి గుండీలనా ?

రావు:— కాదు. ఇవ్వి ఏలోహంతో చేయబడినవోనని—

సుంద:— అది కంసాలిపని. ఐనా ఇప్పుడు నేనా గుండీల్ని కొనబోవటం లేదు.

రావు:— అదికాదు. మూడు సంవత్సరాల క్రితం ఇవి బంగారపు గుండీలు. ఈ గడియారం గొలుసు కూడా బంగారపుదే ! కాని ఇవ్వాడివ్వి ఇమిటేషన్ బంగారపువి.

సుంద:— అట్లాగా? మూడు సంవత్సరాల్లో 'ఇమిటేషన్' అనేది

దేశంలో ఇంత పెరిగిపోయిందన్నమాట ?

రావు:— దేశం సంగతి మనకు అనవసరం. కాని మన ఇంట్లో మాత్రం అన్నివైపులా - అన్ని వస్తువుల్లోనూ 'ఇమిటేషన్' పూర్తిగా పెరిగిపోయింది.

సుంద:— ఐతే మీరు నాకు 'ఇమిటేషన్ భర్త' మాత్రం కాదుకదా ? (నాలిక కొరుక్కుంది)

రావు:— (గుక్క తిప్పుకొని) వస్తువులు ! వస్తువుల సంగతి.

సుంద:— (అర్థమైనట్టు తల ఆడించి) ఉహుం. ప్రాణంలేని వస్తువుల సంగతా ?

రావు:— అంటే నీ వొంటిమీది నగలన్నీ గిల్టువే ! అమ్మాయి నగలన్నీ కూడా మాయబంగారమే ! ఇప్పుడు ఇంట్లో ఒక చిన్నం ఎత్తు బంగారం కూడా లేదు !

సుంద:— (ఆశ్చర్యంతో తనశరీరం మీది నగల్ని చూసుకుంటూ) మాయబంగారమా ? ఆ సంగతి నాకెందుకు చెప్పలేదు ? రోజూ వీటిని మొయ్యలేక ఛస్తున్నాను.... వెధవ నగలు ! (ఒక్కో నగే తీసి పారేస్తోంది)

రావు:— తీసెయ్యవోక. నగలు లేకపోతే నిన్నెవ్వరూ రావు బహద్దూర్ గారి భార్యవనుకోరు—

సుంద:— మాయబంగారమని తెలిశాకనో—?

రావు:— అది తెలియటం చాలాకష్టంలే ! రోజూ పెట్టుకునే నీకే తెలియకపోతే - దూరంనుంచి చూసే వాళ్ళకు ఏం తెలుస్తుంది ?

సుంద:— (నిట్టూర్చి) ఈ జగమే మాయని వేదాంతి చెప్పినప్పుడు నమ్మలేదు.... ఇంతకూ మాయబంగారమేనా ?

కాకిబంగారం కూడానా ?

రావు:— ఇలాటివే ఇంకా అనేక మార్పులు జరిగినయ్. నా నటనా చాతుర్యంతో ఆ సంగతి మీకెవ్వరికీ తెలియనీ లేదు.

సుంద:— ఇంకా మార్పు లంటున్నారు. ఇంట్లో వెండి కంచాలూ వగైరా సామానంతా సిల్వరా? జర్మన్ సిల్వరా?

రావు:— అది వెండే లే!

సుంద:—ఇప్పుడు నాకు అర్థమైంది లెండి. సంవత్సరం నుంచీ మీరు రాత్రిళ్లు హాయిగా ఎందుకు నిద్ర పోగలుగు తున్నారో నాకు తెలిసింది—

రావు:— ఎందుక నంటావ్ ?

సుంద:— ఇంటి దొంగే ఉండగా — ఇంక బైటి దొంగల భయం ఏముంటుందీ? మన మేడచూసి పొరపాటున ఏ దొంగైనా భ్రమ పడ్డా— యీ మాయబంగారం ఏం గిట్టుతుందీ? నిద్ర మేలుకొని కాపలా కాయాల్సినంత విలువగల వస్తువులు ఇంట్లో ఏమీ లేవు, కనుక— మీరు హాయిగా నిద్ర పోగలుగుతున్నారు. ఈరహస్యం తెలియక నేను కాస్త మెలకువతో ఉండాల్సి వొస్తోంది. ఇంకెం దుకూ— యీ రాత్రినుంచీ తలుపులన్నీ తెరిచి హాయిగా నిద్రపోతాను—

రావు:— అంత పని మాత్రం చెయ్యబోక.... ప్రజలకు అను మానం కలుగుతుంది....

సుంద:— ఐతే ఆ బంగారమంతా ఏం చేశారూ ?

రావు:—బంగారాన్ని ఎవరుమాత్రం ఏం చెయ్యగలుగుతారూ? అమ్ముకున్నాను.

సుంద:— ఆ డబ్బంతా ఏం చేశారూ?

రావు:— ఏం చేసివుంటా ననుకున్నావ్ ?

సుంద:— బాంకులో సేవింగ్స్ ఎకౌంటులో వేసివుంటా రనుకుంటాను—

రావు:— (మంగలికత్తి నూరుతూన్నట్టు సూచిస్తూ) సేవింగ్స్ ఎక్కౌంటుకాదు— షేవింగ్స్ ఎక్కౌంటు!

సుంద:— అంటే?

రావు:— గిండీ రేసెస్‌లోనూ. బ్రాకెట్ కంపెనీల్లోనూ—

సుంద:— (మాట మధ్యలో అందుకొని?) క్షవర కల్యాణం ఐందన్నమాట?

రావు:— మెరుగు పెట్టిస్తానసే మిష మీద నగల్ని తీసుకొని పోయి - వాటికి మారుగా మాయ బంగారపు సరుకును మూడోకంటికి తెలియకుండా తీసుకొచ్చాను. ఇంత చేసినా ఊళ్ళో మనకు లక్షాధికార్లనే పేరు పోలేదు—

సుంద:— (పెదవి విరిచి) లక్షాధికార్లేం ఖర్మం? కోటీశ్వరులే!

రావు:— కోటీశ్వరులా?

సుంద:— ఔను. మీకు పదకొండు కోట్లు ఉన్న సంగతి చాకలివాడికి కూడా తెలుసు!

రావు:— ఎల్లుండికల్లా బాంకులో ఇరవై వేలు కట్టాలి.

సుంద:— ఎందుకూ? కుటుంబ రక్షణార్థమా?

రావు:— కాదు. స్వరక్షణార్థం. బాంకు డబ్బు ఇరవై వేలు ఖర్చు పెట్టేశాను.

సుంద:— పోనీండి. వాళ్లు వసూలు చేసుకునేందుకు వొచ్చినా డబ్బు ఖర్చయి పోయింది కనుక - ఇక యీ మేడ వేలాం వేసుకుంటారు - అంతేగా ?

రావు:— మేడా ? పొలాలూ, ఇల్లూ కూడా రెండేళ్ళ క్రితమే అమ్మేశాను. కిందటి సంవత్సరం కారు ఎందుకు అమ్మానో తెలుసా ?

సుంద:— పెట్రోల్ రేషనింగ్ చాలటం లేదనీ - మరామత్తులకు ఎక్కువ డబ్బు ఖర్చవుతోందనీ—

రావు:— కాదు. పెట్రోల్‌కు డబ్బుల్లేక—!

సుంద:— మరీ హాయి! ఇంక వాళ్ళకు అమ్ముకునేందుకు మాత్రం ఏం వుందీ ? ఐనా, డబ్బు తీసుకున్నప్పుడు ఊరుకున్నవాళ్ళు తీసుకొన్నాక మాత్రం ఊరుకోరు కనుకనా ?

రావు:— తీసుకుంటున్నప్పుడు వాళ్ళ కసలు తెలియదుగా ! ఐనా నాకు బాంకువాళ్ళ గోలేమీ లేదు. ఎల్లుండి ఆడిటరూ, ఇనస్పెక్టరూ వొస్తున్నారు. ఇక యీ బండారం బైటపడక తప్పదు.

సుంద:— బాంకు సెక్రటరీ ఉద్యోగం పోతుందని భయమా ? ఇంట్లో వున్న మాయబంగారం సంగతి ఊరంతా తెలుస్తుందని దిగులా ?

రావు:— ఆ భయాలేమీ లేవు. నన్ను జైలుకు పంపుతారు!

సుంద:— ఉహుఁ. నా దగ్గర డబ్బేమీ లేదని మీకు తెలుసు. కావాలంటే యీ మాయబంగారపు నగల్ని తీసుకోండి.

రావు:— వాటికి ఇరవై వేలు రావటం అసంభవం !

సుంద:— మరి ఇంకేం చెయ్యగలరూ ? ఈ పత్రికలో ఒక

తాయిత్తును గూర్చిన ప్రకటన వుంది. వెల స్వల్పము! ఫలమధికము! రెండు రూపాయిల న్నరట! ఈ కష్ట సమయంలో మీరొక తాయిత్తును తెప్పించుకోండి.

రావు:— ఇప్పుడేనా నీ వేళాకోళాలు? నేను జైలుకు వెళ్లటం నీకు ఇష్టమా?

సుంద:— నా ఇష్టప్రకారం జరుగుతుందా?

రావు:— పోనీ అది నీకు సంతోషమా?

సుంద:— నా సంగతి మీకు అనవసరం. జైలుకు వెళ్లేది మీరు కాని - నేను కాదు!

రావు:— నీకు సానుభూతన్నా లేదు.

సుంద:— ఉంటే మాత్రం మీరు జైలుకు వెళ్ళటం తప్పుతుందా?

రావు:— కనీసం తప్పించుకునే ఉపాయాన్ని ఆలోచించు.

సుంద:— ఏదన్నా పాడుపని చేసేప్పుడు ముందు తప్పించుకునే మార్గాన్ని వెతుక్కోవటం విజ్ఞుల లక్షణం. బోనులో పడే ఎలుక - ముందుగానే బైటపడే దారుల్ని వెతుక్కుంటే దానికంత అవస్థ పట్టదుగా!

రావు:— నిజమే! ఇప్పుడు అదంతా మించిపోయింది. రెండో సారి ఇలాంటి పని చేసినప్పుడు నీ సలహా గుర్తుంచుకుంటాను!

సుంద:— ఊళ్ళో ఇంకా మీరు లక్షాధికార్లనే అభిప్రాయం వుందిగా - ఎక్కడన్నా అప్పు అడగండి....

రావు:— అప్పు అడగటం మన లేనితనాన్ని సూచిస్తుంది. ఇప్పటికే చాల అప్పులుఅయినయ్. ఇప్పుడు ఇంకెక్కడా

అప్పు పుట్టదు. అసలు అప్పు అడుగుతే గోలయిపోయి -
పాత అప్పుల వాళ్ళందరూ వెంట పడకమానరు !

సుంద:— పోనీ - ఏ దూర ప్రదేశమన్నా పారిపోండి.

రావు:— చుట్టూ సముద్రాలు ఉండగా ఎక్కడికి పారిపో గలనూ ? బతికి ఉండాలే కాని - నాలుగు రోజుల్లో పట్టుకురారూ ?

సుంద:— నా కింకేమీ ఆలోచన పోవటం లేదు. సరిగ్గా హరిశ్చంద్రుడు ఇరుక్కున్నట్టు ఇరుక్కున్నారు.

రావు:— హరిశ్చంద్రుడికి ఒక్కడే నక్షత్రకుడు. వాడైనా అంత ప్రమాదకరమైన వ్యక్తి కాదు. మాటిమాటికీ డబ్బు అడగటంకన్న ఇంకేమీ చేసేవాడు కాదు. ఎవ్వరూ చూడని ఆ అడవుల్లో అప్పుడప్పుడు తనను మొయ్యమనే వాడు; హరిశ్చంద్రుడు బలాఢ్యుడనీ - తనను పడెయ్యకుండా మొయ్యగలడనీ వాడి ధైర్యం ! ఆ మాత్రం శిక్షతో మనను వొదలరుగా ? మనుషుల విజ్ఞానంతో పాటు శిక్షల పరిమితి కూడా పెరిగిపోయింది. ఈ పోలీసులందరూ నాకు నక్షత్రకులే కదా ?

సుంద:— ఇక మీకు యీ భార్యా పిల్లలూ ఉన్నారు. ఆ నాటి ప్రభుత్వం అంగీకరించినట్టు యీ భార్యా పిల్లల్ని అమ్మటం ఇప్పటి ప్రభుత్వం అంగీకరించదు. కనుక - మీకు మరి ఉపాయం లేదు.

రావు:— (కాస్త ఆలోచించి) నాకో మంచి ఉపాయం తట్టింది.

సుంద:— ఏమిటదీ ?

రావు:— శ్రీధరాన్ని అడుగుతే ?

సుంద:— అతని దగ్గర అంత డబ్బు సిద్ధంగా వుందా ?

రావు:— మా బాంకులోనే ముప్పైవేల పైనవుంది—

సుంద:— ఊహుం. పది రోజుల క్రితం అతన్ని మన ఇంటికి రావొద్దని చెప్పి ఇవ్వాళ ఏ మొహం పెట్టుకొని డబ్బు అడుగుతారూ ?

రావు:— పది రోజుల క్రితం ఇంత ఇబ్బంది వొస్తుం దనుకో లేదు. తీరా ప్రమాదంలో పడ్డాక అతను జ్ఞాపకం వొచ్చాడు. 'ఇకనుంచీ ఇంటికి రావొద్దు' అని నిన్ను చెప్పమంటే - నువ్వు అందుకు ఒప్పుకో లేదు. అప్పుడా మాట నువ్వే చెప్పి వున్నట్టయితే - ఇప్పుడు అతన్ని అడిగే అవకాశం నాకు ఉండేది !

సుంద:— బాగానేవుంది. మీరందరూ మంచివాళ్ళవ్వాలి. మధ్య నేనొక్కతెనే చెడ్డదాన్న వ్వాలన్నమాట ?

రావు:— ఇందులో మంచితనమూ, చెడ్డతనమూ ఏముందీ ? పెళ్ళికాని పిల్లతో ప్రేమ సంభాషణలు చేస్తూంటే వారిం చాల్సిన బాధ్యత నీకుమాత్రం లేదూ ?

సుంద:— అది నాఅంతట నాకు తట్టినట్టయితే ఎలావుండేదో? వాళ్ళిద్దరి మధ్యా యీ అనురాగం సంవత్సరంనుంచీ వృద్ధతూన్నా నా కెందుకని నేను అడ్డం పో లేదు,

రావు:—(అదిరి) ఐతే ఇది సంవత్సరం క్రితమే ఆరంభమైన వ్యవహార మన్నమాట? ఆసంగతి నా కిదివరకు తెలియదే!

సుంద:— ఎప్పుడూ బైట తిరుగులాడే వాళ్ళు—మీకు తెలి యక పోవటంలో అర్థంవుంది; కాని ఎప్పుడూ ఇంట్లో ఉండే నా కన్నా తెలియకుండా ఎలా వుంటుందీ ?

రావు:— అంటే నువ్వు దీనికి అంగీకరించి ఊరుకున్నా వన్న మాట ?

సుంద:— అన్న మాటలూ, తమ్ముడి మాటలూ నాకు తెలియవు. నా అంగీకారం కోసం యీ ఇంట్లో ఎవ్వరూ వేచి కూర్చోలేదు. ఇతరుల విషయాల్లో— అందులోనూ అతి ప్రమాదమైన ప్రణయ గాధల్లో జోక్యం కలిగించుకోవటం చాలా బుద్ధి తక్కువ పని అని వూహుకున్నాను.

రావు:— పోనీ నా కన్నా చెప్పలేక పోయ్యావ్ ?

సుంద:— ఇతరుల మాటల్నీ, చేతల్నీ వాళ్ల వీపు వెనక విమర్శించే అలవాటు నాకు లేదు. ఎవరి గోల వాళ్ళు పడాలి కాని, ఇంకోళ్ళ విషయం నాకు దేనికీ ? నాకు తెలిసిన విషయాల్ని చెప్పేందుకు మీరే దొరికారా ? పోనీ మీరు నన్ను అడిగారా ?

రావు:— నాకు తెలిసివుంటే— నిన్ను అడగటం దేనికీ ?

సుంద:— ఐనా ఇప్పు డేమైందీ !

రావు:— ఇది ఇంత దూరం రాకుండా ఉండాల్సింది.

సుంద:— వొస్తే మాత్రమేం ? ఈడొచ్చినపిల్ల కనుక ప్రకృతి సిద్ధంగా ప్రేమించింది. అదేమన్నా ప్రాణం లేని వస్తువా కదలకుండా, మెదలకుండా ఒక మూల పడివుండేందుకు?

మీకు నచ్చిన వాళ్లను మీరు ప్రేమించినట్టే - దానికి నచ్చిన వాణ్ని అదీ ప్రేమించింది—

రావు:— రేపు దానికి పెళ్ళి కానక్కర్లా ?

సుంద:— అక్కర్లేదని నేనెందుకంటానూ ? అవుతుంది.

రావు:— ఈ సంగతి తెలుస్తే ఎవరు పెళ్ళాడుతారూ?

సుంద:— అదా మీ దిగులు ? శ్రీధరమే పెళ్ళాడుతాడు!
రావు:— అతనా ? జయనా? పెళ్ళాడటమా? (వికటంగానవ్వి)
నీకు మతి చెడుతోంది....
సుంద:— ఏం అతను రూపవంతుడు కాదా ? విద్యావంతుడు
కాదా ? ధనవంతుడు కాదా ? అతనికేం తక్కువైందీ ?
రావు:— అవన్నీ ఉన్నయ్. కాని అతని కులం తక్కువ !
సుంద:— ఏం - కులాన్ని పట్టి ప్రేమ వుందన్నమాట ?
రావు:— అసలు ప్రేమ గుడ్డిదన్నాడు కవి. ప్రేమకు ఇలాటి
లోపాలు కనిపించక పోవటం సహజమే కాని - మనంద
రికీ కూడా కళ్ళు లేవంటావా ?
సుంద:— ఉన్నయ్. కాని మన ప్రణయ ఘట్టాల్లోనే వాటిని
ఉపయోగించుకోవటం ఉచితం.
రావు:— ఈ మాత్రం ఆలోచన నాకు తట్టలేద నుకున్నావా?
జయకు ఏం తక్కువా ? రూపవతి కాదా ? విద్యావతి
కాదా ? నాకు కూతురు కాదా ?
సుంద:— అదంతా నిజమే ! వధూవరుల్లో ఒకరి కొకరు తీసి
పోరు కనుక - పెళ్లి చేసెయ్య మన్నాను !
రావు:— తక్కువ కులం వాడికి పెళ్లి చెయ్యాల్సిన ఖర్మం
ఏ మొచ్చిందీ ?
సుంద:— మరి పద్ధెనిమిది ఏళ్ల వరకూ దాన్ని ఇంట్లో పెట్టు
కొని కూర్చున్నారేం ?
రావు:—కొంతమంది ఆడపిల్లలు తండ్రులకు భారంగావుంటారు
కొంతమంది తేలిగ్గా ఉంటారు. జయ యీ రెండో రకా
నికి చెందింది అదీకాక నీకు పెళ్ళి ఎప్పుడైంది చెప్పూ—

సుంద:— నా సంగతి వేరు. నేను బీదదాన్నిగా పుట్టాను.

రావు:— నేనూ ఊరికే కూర్చోలేదు. సంబంధం వెతికి పెళ్ళి చేసెయ్యాలనే చూస్తున్నాను.

సుంద:— ఎక్కడో చూడటం దేనికి? మీ బాధ్యతను మీరు సకాలంలో గుర్తించక పోయినా - జయ తన బాధ్యతను తానే గుర్తించి - తగిన వరుణ్ని వెతుక్కుంది. మీకు ఎంత శ్రమను తప్పించిందో ఆలోచించండి!

రావు:— ఆ సంగతంతా తరువాత ఆలోచించవొచ్చు. ఇప్పుడు శ్రీధరాన్ని పైకం ఎలా అడగటమా అని ఆలోచిస్తున్నాను.

సుంద:— ఉత్తరం రాసి పంపండి.

రావు:— అమ్మో! లిఖిత పూర్వకంగా కూడానా? నేను అడగటం అంత సబబుగా ఉండదు. జయ ప్రేమ ప్రవాహంలో కొట్టుకు పోతున్నాడు కనుక - జయ చేతనే అడిగిస్తే పనయి తీరుతుంది.

సుంద:— అతన్ని ఇక్కడికి రావొద్దనీ, అమ్మాయి చదువును హఠాత్తుగా మానిపించీ, వాళ్ళిద్దరి మధ్యా సముద్రాలు కల్పించారే - ఇప్పుడు జయచేత ఎలా అడిగిస్తారూ? అసలు అతను ఇక్కడికి వస్తేగా?

రావు:— వొచ్చేట్టు చెయ్యాలి. జయను ఎలాగైనా ఒప్పించి దానిచేతనే పిలిపించాలి........

సుంద:— అంత తేలిగ్గా నమ్మవొద్దూ?

రావు:— ఆ సామర్థ్యం మనలో ఉండాలి కాని ఎందుకు నమ్మడూ? పది రోజుల క్రితం ఏదో పొరపాటున కతి

నంగా ప్రవర్తించినట్టూ, ఇప్పుడు దానికి పశ్చాత్తాప పడుతూన్నట్టూ నటించి........

సుంద:— చివరకు - జీవిత సౌఖ్యమంతా 'నటన' మీదనే ఆధారపడి వుంటుందనే విషయాన్ని మీరు బాగా ఆచరణలో పెడుతూన్నట్టున్నారు.

రావు:— అసలు ఆ కీలకం తెలుస్తే జీవితం అనుకునేటంత బాధాకరంగా ఉండదు.

సుంద:— పోనీ జయ ఇదంతా నమ్మినా అతన్ని డబ్బు అడగటం—

రావు:— అదంతా నా కోసం. అదీ అప్పుగా అడగమంటాను.

సుంద:— ఆ అప్పు తరువాత మాత్రం ఎట్లా తీరుస్తారూ ?

రావు:— తరువాతి సంగతి చూడొచ్చు. తగిన వ్యవధి వుంటే సర్దుకో వచ్చు. అసలు ఆ టైమే ఎలాటి గడ్డు సమస్యనైనా ఇట్టే కరిగించేస్తుంది.

సుంద:— అది కాదు.... మీరు ఆమె ప్రేమను అమ్మాలని చూస్తున్నారు. విద్యావంతురాలు ఆత్మాభిమానాన్ని అమ్ముకునేందుకు ఒప్పుకుంటుందా అని——

రావు:— ఎందుకు ఒప్పుకోదూ ? హరిశ్చంద్రుడు భార్యనూ, కొడుకునూ మొత్తంగా అమ్మితే— నేను మనిషిలోనూ జీవితంలోనూ ఒక భాగమైన ప్రేమను మాత్రమే అమ్ముతున్నాను. అదీకాక ఆ ప్రేమను నేను పరాయివాడికి అమ్మటం లేదు; ఏ వ్యక్తికి అది అర్పించ బడిందో—అతనికే అమ్ముతున్నాను.

సుంద:— విలువ కట్టలేని ప్రేమకు ఒక విలువను నిర్ణయిం

చటం— దాన్ని తక్కువ చూపుతో నీచ పరచటమే అవుతుంది

రావు:— ఆ వేదాంతం ఇక్కడ పెట్టుకుంటే లాభం లేదు. ఒక వేళ నేను జైలుకు వెళ్తే మీ అందరి గతి ఏమౌతుందో ఆలోచించు—

సుంద:— అయ్యేందుకు ఏముందీ? ఇంట్లో తింటూకూర్చుంటాం

రావు:— కుటుంబం పరువు మర్యాదలే పోతయ్. రేపు కొడుకూ, కూతురికీ పెళ్ళిళ్ళు ఎలా అవుతయ్ ? అమ్మాయికే విలువ లేనప్పుడు— అమ్మాయి ప్రేమకు ఎక్కణ్నుంచి విలువ వుంటుందీ? అందుకని ఆ ప్రేమ వేడిగా వున్నప్పుడే అమ్ముకోవటం మంచిది. ఆలస్యం చేస్తే దాని విలువ పోతుంది! ఏమంటావ్ ?

సుంద:— నే నేమనగలను ? మీ ఇష్టం వొచ్చినట్టు చేసుకోండి మీకు ఎవరు నచ్చజెప్ప గలరు ?

రావు:— అట్లా దారికిరా. పద్దెనిమిదేళ్లు అమ్మాయిని అతి గారాబంగా, ఆడింది ఆటగా, పాడింది పాటగా సాగిస్తూ పెంచాను. దాని కింద ఎంతడబ్బు ఖర్చుపెట్టి వుంటానో ఆలోచించు. ఎంగిలికూడు తినే కుక్కకున్న విశ్వాసం లాటిదైనా మానవుల్లో ఉండకపోదు అందులోనూ ఇలాటి క్లిష్ట పరిస్థితిలో అది నాకు మాట మాత్రం సహాయం చెయ్యలేక పోతుందా ?

సుంద:— ఆ మాట విలువ ఇరవై వేలు !

రావు:— అందుకనే నేను దాని మాటమీద ఆధార పడ్డాను. విలువ లేని మాటలూ, విలువ తక్కువ మాటలూ,

ఎవర్నో అర్థించాల్సిన అవసరం ఎందుకుంటుందీ? నేను మూగవాణ్ని కాదుగా!

సుంద:— ఇంతకూ ఇదంతా పెట్టుబడిదారీ విధానం కిందికి లాగారు. ఇన్నాళ్ళూ కూతురు కింద ఖర్చుపెట్టిన డబ్బును ఏదో విధంగా లాగాలని చూస్తున్నారు.

రావు:— సూక్ష్మంగా ఆలోచిస్తే అసలు జీవితమే వ్యాపారం! ప్రతివ్యక్తీ - తన చుట్టూవున్న ప్రతి ఇతర వ్యక్తితోనూ, కూతుళ్ళనీ, కొడుకులనీ, స్నేహితులనీ, బంధువులనీ భేదం లేకుండానే వ్యాపారం చేస్తున్నాడు.

సుంద:— (ఆశ్చర్యంతో) ఏమన్నారూ? జీవితం వ్యాపారమా?

రావు:— అందుకు సందేహమా? కొడుకును చదివించటం దేనికీ? పెద్దవాడై సంపాయించి - మన ముసలితనంలో మనను పోషిస్తాడని........ భార్యను పోషించటం దేనికీ?

సుంద:— ఇంటెడు చాకిరీ చేయించుకునేందుకు?

రావు:— అట్లా అర్థంచేసుకో. ఇదంతా పెట్టుబడిదారీ విధానం! లాభంలేని పెట్టుబడి జోలికి ఏ మూర్ఖుడు వెళ్తాడూ?

సుంద:— భార్య అంటే బానిస అన్నమాట?

రావు:— ఈ దేశమే బానిస దేశం! ఇక్కడ ఒక బానిసకూ, ఇంకో బానిసకూ చాలా కొద్ది భేదం!

సుంద:— భార్యకూ దాసీదానికీ తేడా లేదా?

రావు:— ఉంది. దాసీదానికి జీతం అంటూ ఇస్తాం............

సుంద:— (మాటమధ్యలోనే అందుకొని) భార్యకు అదికూడా లేదు. దాసీది రోజుకు కొన్నిగంటల బానిసయితే-భార్య జీవితాంతం వరకూ, రోజులోని ప్రతి నిమిషమూ బానిసే!

(కోపంతో) దాసీదాన్ని కొడితే అది ఊరుకోదు; కాని భార్యను కొట్టినా, తిట్టినా పడివుంటుంది.... ఎందుకంటే, టోకు బేరంగా ఒక్కసారే బానిసత్వాన్ని కొనుక్కున్నారుగా — మీ భాగ్యాన్నంతట్నీ లోకానికి టముటమా వేసేందుకు యీ భార్యల మెడల్లో మీ ఆస్థిలో కొంత భాగాన్ని బంగారు రూపాన దిగేస్తారు! ఈ భార్యలు కాస్త కులీనలు కనుక యీ బంగారంతో పారిపోరని మీ ధైర్యం! అదీకాక, ఎక్కడికి పోతేమాత్రం గౌరవం ఏముంటుందీ? అందుకని — ఇక్కడే ఇంత తిని, యీ కొంపనే కుక్కలాగు కాపలా కాస్తూ పడివుంటారు. (లేచి నిలబడి) భార్య అంటే మీ అభిప్రాయం నాకిప్పుడు పూర్తిగా అర్థమైంది. ఈ బోడి భార్యాత్వం నాకు అక్కర్లేదు........

[రెండు అడుగులు వేసింది]

రావు:— (ఆమెను పట్టుకొని, బతిమాలుతూ) అంతకోపమైతే ఎట్లా? అందులోనూ యీ దీనుణ్ని యీ కష్టసమయంలో, నట్టేట్లో ముంచుతావా? నా అభిప్రాయం అడిగావు కనుక చెప్పాను—

సుంద:— ఏనాడో యీ బానిసను కూడా అమ్మితారు!

రావు:— ఏదో పొరపాటున, బుద్ధి గడ్డితిని వాగాను. నాకు నిన్ను కష్టపెడదామని లేదు. ఏదో మాటల సందర్భంలో అదంతా వొచ్చేసింది. అదంతా ఇప్పుడు వొద్దు. నాది తప్పే! ఒప్పుకున్నాను - నన్ను క్షమించు.... ఏం?.... క్షమిస్తావా?

సుంద:— నన్ను బతిమాలకండి (కూర్చుంది)

రావు:— (నిట్టూర్చి, కూర్చుంటూ) రక్షించావ్. ఎంతసేపు బతిమాలాల్సి వుంటుందో నని భయపడి చస్తున్నాను. ఇంక నీవల్ల ఒక్క సహాయం కావాలి....

సుంద:— అమ్మాయికి సిఫారసు చెయ్యాలి, అంతేనా?

రావు:— అట్లా గ్రహించాలి రవ్వ! రవ్వ!.... (చిటిక వేశాడు)

సుంద:— ఈ పాడు వ్యవహారంలో నే నెందుకు జోక్యం కలిగించు కోవాలీ?

రావు:—ఈవ్యవహారం చెడ్డది కనుకనే—ఒక్కణ్ణీ నచ్చచెప్ప లేనేమోననే భయం కలిగింది. మంచి పనయితే ఒక్క మాటలో నచ్చజెప్పవొచ్చు!

సుంద:— దుర్వాసనను వ్యాపింప జేసేందుకు ఎక్కువ కాలమూ, శ్రమా అనవసరం. అతి శీఘ్రకాలంలో అది అంతటా కమ్ముకుంటుంది. దీనికి మీ రొక్క రే చాలు. మీరు అందుకు అతి సమర్థులు కూడాను!

రావు:— ఇందాకటి నుంచీ వాగేప్పటికి ఊపిరి తిత్తులు అలసి పోయినయ్. కాస్త టీ తెప్పిద్దూ.... నౌకరు ఏడీ?

సుంద:— వెచ్చాలు తెచ్చేందుకు బజారు వెళ్ళాడు. ముసలి మేళాం— ఇంకా తిరిగి రాలేదల్లే వుంది! నేనే పోయి తెస్తాను....

[సుందరమ్మ వెళ్ళిపోయింది. లోపల్నుంచి వీణమీద పాటఆరంభ మైంది. ఆ అద్భుత గాన వాహినికి రావుబహద్దూర్ గారు కళ్లు సగంమూసి, కాలితో తాళం వేస్తున్నారు. క్రమంగా తన్మ యత్వంతో కుర్చీకి అంటిపెట్టుకొని, కళ్లు పూర్తిగా మూశారు.

కాలు తాళం వెయ్యటంలేదు. రెండు, మూడు నిమిషాలు గడిచినయ్. సుందరమ్మ టీ కప్పుతో వొచ్చింది. భర్త వాలకం చూసి క్షణం నిలబడి కప్పునుదగ్గిర టేబిల్ మీద పెట్టింది. పాట క్రమంగా ఆగి పోయింది]

సుంద:— ఏమండోయ్! మిమ్మల్నే! నిద్రపొయ్యారా యేం? (జవాబు రాకపోవడంవల్ల భర్తను కదుపుతూ) ఇంతలోనే నిద్రా?

రావు:— (ఉలిక్కిపడి లేస్తూ) ఏమిటీ?

సుంద:— అట్లా బిగతీసుకు పొయ్యారేం?

రావు:— అమ్మాయి పాడేపాటకు తన్నయుణ్ణయి, యీ పాడులోకం నుంచీ, ప్రాణగండాల్లోంచీ, దూసుకుపోయి-ఆకాశంలోకి ఎగిరి పొయ్యాను.

సుంద:— అంత ఎత్తునుంచి దిగేప్పుడు జాగర్త, కాలుజారిందంటే - నడుం విరుగుతుంది....

రావు:— నా అంతట నేనుదిగ లేదుగా! ఇప్పుడు నువ్వొచ్చి దింపావ్.

సుంద:— ఇంకా నయం. నా మీద దూకలేదు. ఐనా యీ అసలు సంధ్యవేళ నిద్దేమిటి?

రావు:— నిద్రలోనే కలలు! అదే ఆనందం!

సుంద:— కలలోనే టీ తాగి అలసట తీర్చుకోక పొయ్యారూ?

రావు:— అన్నట్టు - టీ ఇవ్వు.

(సుందరమ్మ టీ కప్పు అందించింది. రావుబహుద్దూర్ గారు టీ తాగుతున్నారు)

రావు:— జయ ఏం చేస్తోందీ?

సుంద:— పాడుకుంటోంది....విన్నారుగా!

రావు:— జయ ఇంత బాగా పాడుతుం దనుకోలేదు. నా కిప్పుడు శ్రీధరం ఒక్కడేనా - ఇంకా ఇలాంటివాళ్ళు ఒక వెయ్యి మందన్నా దీని ప్రేమప్రవాహంలో తలకిందు లుగా పడ్డారా అన్నంత సందేహం కలిగింది!....సరే.... దాన్నొకసారి ఇక్కడికి పంపు. దాని దగ్గర మాట తీసు కుంటేనే కాని నా మనస్సు స్థిమిత పడదు—

[సుందరమ్మ టీ కప్పు తీసుకొని వెళ్ళబోతోంది)

రావు:— చీకటి పడ్డది. లైటు వెలిగించి వెళ్లు....

[సుందరమ్మ స్విచ్ వేసి లైటు వెలిగించి వెళ్ళిపోయింది. ఇప్పుడు తన పనికి సహాయపడే వాతావరణాన్ని సృష్టించు కోవటంలో రావుబహద్దూర్ గారు నిమగ్న లయ్యారు. తలమీది వెంట్రుకల్ని మరింతగా చెరిపాడు. ముఖంలోకి దీనత్వాన్ని తెచ్చుకున్నాడు. కళ్ళు నలుపుకొని, కాస్త, ఎర్రపడేట్టు చేసుకున్నాడు. కంఠం లోకి కరుణరసం తెచ్చుకు నేందుకు రెండు మూడు గుటకలు మింగాడు. ఇక తను సిద్ధపడ్డట్టు కుర్చీలో ముడుచుకొని కూర్చొని ఆలోచిస్తున్నాడు.

ఒక క్షణం గడిచింది.

జయ వొచ్చి - విషయం అర్థంగాక ఒక్క క్షణం నిలబడి పోయింది. యవ్వనంలో మిసమిస లాడే శరీరం. బలిష్ఠంగా పెరి గిన అవయవ సౌష్టవం. ముఖంలో ఆరోగ్య జ్యోతీ, కళ్ళల్లో కృత్రిమాన్ని ప్రకటించలేని విజ్ఞాన కాంతీ కనిపిస్తున్నవి. ఆ పెద్ద కళ్ళల్లోని చలాకీతన మంతా - ప్రస్తుతం బలవంతాన అణిచి నట్టుగా కనిపిస్తుంది. నిరాశా మేఘం ఆవరించటంవల్ల ఆమె కుంగి పోయింది. సరిగ్గా దువ్వని జుట్టూ, మాసిన చీరా మొదలైనవి - ఆమె ప్రస్తుతం జీవితంలో చూపే నిర్లక్ష్యతను సూచిస్తున్నయ్]

జయ:— నాన్నా ! పిలిచారా ?

రావు:— ఆఁ. అట్లా కూర్చోవమ్మా !

జయ:— (వినయాన్ని సూచిస్తూ కూర్చుంది)

రావు:— పది రోజుల క్రితం ఏదో ధ్యాసలో వుండి ఒక పొర పాటు చేశాను—

జయ:— పొరపాటా ? ఏమిటది ?

రావు:— శ్రీధరాన్ని ఇక ఇక్కడికి రావొద్దన్నాను. నిన్ను చదువు మానెయ్య మన్నాను. అతనితో ఇక మాట్లాడ వొద్దన్నాను.

జయ:— (ఆమె ముఖం వికసించింది. క్రమంగా విషాద మేఘాలు పటాపంచ లౌతున్నయ్—)

రావు:— తరువాత ఆలోచించి పశ్చాత్తాప పడ్డాను.........

జయ:— పోనీలే నాన్నా! నాదే పొరపాటేమో నని యీ పది రోజులూ ఆలోచిస్తూ బాధ పడుతున్నాను. చిన్నతనం నుంచీ నేను ఎన్ని చిలిపి పనులు చేసినా మీరు సహి స్తూండే వాళ్ళు. కాని మొన్న మీ మనస్సు ఇంత నొప్పించానని ఎంతో విచారించాను.

రావు:— అదంతా జరిగిపోయిన విషయం. ఇవాల్టినుంచీ— కాదు— యీ క్షణంనుంచే మీ స్నేహానికీ నీ సుఖా లకూ ఇక అడ్డురాను. నువ్వు బాధ్యత తెలిసిన విజ్ఞాన వంతురాలివి.

జయ:— మీ విశాల హృదయాన్ని ఇప్పుడు బాగా అర్థం చేసుకో గలిగాను....

రావు:— అసలు సంగతి చెప్పనీవమ్మా! ఈ మధ్య బాంకు లోంచి కొంత పైకాన్ని.... ఇరవై వేలు తెచ్చి కుటుంబం కోసం వాడేశాను.

జయ:— ఇరవై వేలా ? ఈమధ్య అంత ఖర్చయిందా ?
రావు:— కొన్ని అత్యవసరమైన దావాల కింద ఖర్చయింది. కొద్ది రోజుల్లోనే పోయిన పూర్వీకుల ఆస్థంతా మనకు వొస్తుంది.
జయ:— (నమ్మినట్టు తల వూపటంతో సూచించింది)
రావు:— ఎల్లుండి ఉదయానికల్లా ఎవరికీ తెలియకుండా ఆ డబ్బు బాంకులో కట్టక పోతే— నేను జైలుకు వెళ్ళాల్సి వుంటుంది—
జయ:— అంతదూరం ఎందుకు వొస్తుంది ? నాకున్న నగలన్నీ ఇచ్చేస్తాను. అమ్మేయ్యండి.... ఇప్పుడే తీసుకొస్తాను— (వెళ్ళేందుకు లేచి నిలబడ్డది).
రావు:— (అదిరి, చప్పున) కూర్చోవమ్మా! అంతా చెప్పనీ— నీ నగలూ, అమ్మ నగలూ ఇచ్చేవా లాభంలేదు....
జయ:— అదేమిటి నాన్నా ! బోలెడు ఖరీదుగల బంగారు నగలు ఇంట్లో వుంటే అలా అంటారేం ?
రావు:— ఆ నగలన్నీ కోర్టు ఖర్చులకింద ఇదివరకే అమ్మేశాను. ప్రస్తుతం ఇంట్లో ఉన్నవి గిల్టు నగలు. ఆ సంగతంతా అలావుంచు. ఇప్పుడు నేను యీ కష్టంలోంచి తప్పించుకునే ఉపాయం ఒక్కటే వుంది—
జయ:— చెప్పండి.
రావు:— అది నీ వల్లనే అయ్యే పని ! చేస్తానని వాగ్దానం—
జయ:— ఏం వాగ్దానం చేస్తున్నానో తెలియకుండా వాగ్దానం చెయ్యమంటారా ? మీ మీద నాకున్న అభిమానాన్ని మీరు అనుమానిస్తున్నారు. మీరు కని, పెంచిన యీ

ప్రాణాన్ని ఇచ్చేందుకైనా సిద్ధంగా వున్నాను

రావు:— ఆ మాత్రం నమ్మకం నాకు లేక కాదు. శ్రీధరం తాలూకు ముఫ్పైవేల పైబడిన మొత్తం మన బాంకు లోనే వుంది. అతన్ని వొక ఇరవైవేలు అప్పుగా అడిగా వంటే—

జయ:— అసలతను ఇక్కడికి రావటమే లేదు కదా ?

రావు:— కబురంపి పిలిపించు—

జయ:— (అనుమానిస్తూ) ఇప్పుడు పిలిపించి యీ డబ్బు అడిగానంటే- ప్రత్యేకం ఇందుకోసమై తనను ఆహ్వానించి నట్టు భావిస్తారేమోనని—

రావు:— రాగానే అడగమని చెప్పానా ? కొంత మాటా మంచీ అయ్యాకనే మాటల సందర్భంలో—

జయ— పోనీ మీరే అడగరాదా ?

రావు:— నీ తండ్రి గౌరవాన్ని నువ్వు కాపాడాలి. నా అంత గొప్పవాడు అడిగాడంటే—

జయ:— ఇది ప్రేమను అమ్ముకోటంగా అర్థం చేసుకుంటా రేమో ?

రావు:— హరిశ్చంద్రుడి కథ జ్ఞాపకం చేసుకో. భార్యా బిడ్డల్ని అమ్ముకొని వంశమర్యాదను నిలబెట్టాడు. అందుకు భార్య తనకు తానై వెంటనే త్యాగం చేసింది—

జయ:— ఐతే యీ పురాణాలు మనకు ప్రమాణాలా ! ఆ వ్యక్తులు మనకు ఆదర్శ ప్రాయులా ?

రావు:— అందుకు సందేహమా ? హిందువుల గొప్పతనమంతా ఆ పురాణాలే ! ఆ మహానుభావుల కన్న మనకు ఆదర్శ

ప్రాయు లెవరున్నారూ ?

జయ:— (నవ్వి) ఐతే నాన్నా ! రుక్మిణి గాథను మీరు జ్ఞాపకం చేసుకోండి. ఆమె తండ్రీ, అన్నా శ్రీకృష్ణుడితో ఆమె వివాహాన్ని ఒప్పుకో లేదు. అప్పుడు ఆమె తన ఆత్మబంధువులకు ఎవరికీ తెలియకుండా - శ్రీకృష్ణుడితో రథం ఎక్కి పారిపోయింది. ఈ కాలంలో రథాలు కావు కనుక - జట్కాలు, కార్లూ, రైళ్లూ - ఇంకా వీలుంటే విమానాలూ ఉపయోగించి యీ ప్రేమ పక్షులు ఎగిరిపోతూంటారు. రుక్మిణికి దేవత్వం అంటగట్టారు కనుక - ఆమె చేసిన పనిని 'లేచిపోవటం' అన లేరు, అదే మనలాటి సామాన్యులు చేస్తే - 'లేచిపోవటం' కింద జమవేస్తారు. నేను రుక్మిణిని ఆదర్శప్రాయంగా తీసుకో వాల్సిందేనా ?

రావు:— (గొంతులో వెలక్కాయ పడ్డట్టు కొంచెం ఆగి) అలా తర్కిస్తే నేను చెప్పలేనమ్మా ! ఐనా ఇక్కడ నువ్వు రుక్మిణి చెయ్యాల్సినంత పని చేసే సందర్భం కూడా లేదు.

జయ:— మీకు కోపం వొచ్చినట్టుంది....

రావు:— నీ మీద నాకేం కోపమమ్మా ? నీ తెలివి తేటలూ, విమర్శనా నైపుణ్యమూ ఇంత గొప్పగా వుంది కదా నని గర్వం కూడా కలిగింది....నువ్వే అతన్ని పైకం అడగటంలో ఇంకో రహస్యం కూడా వుంది—

జయ:— ఏమిటది ?

రావు:— నీ మీద అతని కున్న అనురాగాన్ని పరీక్షించుకునే సమయం కూడా ఇదే! ఈ రోజుల్లో రైలు పెట్టెలనుంచీ,

సినిమాకు వెళ్లే రోడ్డు మీద వరకూ ప్రేమ ఘట్టాలకు అనుకూలమైన వాతావరణమే కనుక - నీ ప్రేమ విలువను కనీసం నువ్వయినా ముందు తెలుసు కోవాల్సిన అవసరం వుంది....

జయ:—(నవ్వి) ఐతే ప్రేమను పరీక్షించు కోనేందుకు కొలపాత్ర డబ్బా ?

రావు:— మనిషి నిజ స్వరూపాన్ని కనిపెట్టేందుకు డబ్బు గీటు రాయి లాటిది !

జయ:— ఆ మాటలో నాకేమీ నమ్మకం లేదు. నన్ను అపార్థం చేసుకుంటారేమోనని భయ పడుతున్నాను.

రావు:— నిన్ను హృదయ పూర్వకంగా అతను ప్రేమించి ఉండాలే కాని—— నువ్వు ప్రాణాన్ని అడిగినా ముందు వెనుకలు ఆలోచించకుండా త్యాగం చేసేస్తాడు. ఇప్పుడు నువ్వు భయపడటానికి అర్థం—— అతని ప్రేమను శంకించటమే !

జయ:— అతని ప్రేమ విషయం నాకు కలలో కూడా అనుమానం లేదు. సరే— అతను నన్నెలా అర్థంచేసుకున్నా ఫర్వాలేదు. మీకోసం అంతా త్యాగం చేస్తాను—

రావు:— నా కోసం నీ సౌఖ్యాన్ని త్యాగం చెయ్యమన లేదు. జైలుకు వెళ్ళి బాధ పడలేక యీ ముసలివాడు యీ పన్నాగం పన్నాడనే అభిప్రాయం ఎందుకు కలగాలీ ? నా పిల్లల కోసమూ, భార్య కోసమూ జైలుకు వెళ్తే మాత్రమేం ?

జయ:— మీరిప్పుడు పడే బాధకు నేనే కారకురాల్నయి

వుంటాను. నన్ను క్షమించండి. మాట మాత్రం సహాయం చెయ్యలేని విశ్వాస విహీనురాల్ని కాదు. ఈ మాటలు నా నాలుక చివరినుంచి వచ్చినవి కావు; హృదయంలోని లోతు ప్రదేశాలనుండి వచ్చినవి—

[సుందరమ్మ వొచ్చింది]

సుంద:— తండ్రీ కూతుళ్ళు గొప్ప సమస్యను భేదిస్తున్నట్టుంది!

జయ:— ఏం లేదమ్మా—

రావు:— సరే.... రేపు ఉదయమే పిలిపించ వమ్మా!

జయ:— అట్లాగే నాన్నా! వీలుంటే— యీ పూటే పిలిపిస్తాను.

[జయ వెళ్ళిపోయింది]

రావు:— (కొత్తగా ముఖంలోకి ధైర్యాన్ని కొని తెచ్చుకొని) చూశావా! మన పన్నుగడ పారక పోవటమేమిటి?

సుంద:— కఠిన హృదయులూ, స్వార్థ పరులూ— ఎదుటి వ్యక్తి హృదయాన్ని— అందులోనూ అతి కోమలమైన స్త్రీ హృదయాన్ని— దీనత్వంతో ఇట్టే భేదించగలరు! మీ రహస్యం బైటపడి పోతుందేమోననే భయంతో నాతో కూడా చెప్పకుండా తప్పించుకు పోయింది. ఎంత అమాయకురాలు!

రావు:— తెలివిగల వాళ్ళ మధ్య జీవించటం బాధాకరంగా వుంటుంది; ఎందుకంటే మన తెలివి తేటలు అక్కడ వృథా!....ఎక్కిచావవు!

[బైట కారుహారన్ మోగింది]

సుంద:— ఏదన్నా రోడ్డున పొయ్యే కారు హారన్ వినిపించి

నప్పుడల్లా—మన కారు సంగతి గుర్తొస్తూంటుంది....

రావు:— ఎనిమిది గంటలైనా రాజాగాడు కొంప జేరడేం?

[రాజా రావు వొచ్చాడు. వయస్సు పదిహేడు సంవత్సరాలే అయినా, మంచి ఆరోగ్యవంతమైన శరీరం కనుక—ఇరవై ఏళ్ళ వాడల్లే కనిపిస్తాడు. పెద్ద అందమైన కళ్ళు పోలికల్నిపట్టి సుందరమ్మ కొడుకై వుంటాడనుకో వొచ్చు. నిరాడంబరంగా లాగూ, చొక్కా తొడుక్కున్నాడు. తొందరను సూచించేందుకల్లే గాభరాగా వొచ్చాడు.]

రాజా:— (తొందరలో తండ్రిని చూడకుండా) అమ్మా! నాకు అన్నం పెట్టమను.... త్వరగా వెళ్ళాలి.

సుంద:— ఎక్కడికీ? అంత తొందరేం? నాన్నగారు కూడా ఇంకా భోం చెయ్యలేదు

రాజా:— ఇంట్లో ఉండేవాళ్ళ భోజనానికి తొందరేమీ లేదు. తీరుబడిగా భోంచెయ్యవచ్చు. ఇవ్వాళ స్కూల్లో నాటకమూ, ఆ నాటకంలో నాకు వేషమూ వుంది—

సుంద:— (నవ్వుతూ) తండ్రి దగ్గర్నుంచి నీకు ఏది వొచ్చినా, ఏది రాకపోయినా— యీ నటనా నైపుణ్యం మాత్రం బాగానే అబ్బినట్టుంది....

రాజా:— (వినిపించుకోకుండా) అదీకాక, నాకోసం ఒక పెద్ద మనిషి కారుతో సహా బైట వేచి కూర్చున్నాడు. అందు కని నేనింక ఆలస్యం చెయ్యకూడదు.

సుంద:— చిన్నవాడివి....నీకు పెద్దమనుషుల్తో స్నేహ మేమిటీ?

రాజా:— పెద్దమనిషంటే నీ ఉద్దేశం— తాటిచెట్టంత పొడుగూ, ఒకటిన్నర హండ్రెడ్ వెయిట్ల బరువూ ఉండాలనా! ఈడులో చిన్నయినా— ప్రవర్తనలో పెద్దతనాన్ని—

అంటే ముసలితనం కాదనుకో- సూచించే వాళ్ళు - పెద్ద మనుషులు !

సుంద:— ఇంతకూ ఆ పెద్దమనిషి ఎవరూ ? ఆ మర్యాదస్తు డైన అతిథిని కారులో, వాకిట్లో కూర్చోపెట్టి రావటం దీనికే ? ఇక్కడికే తీసుకొచ్చి నీతోపాటు భోజనమన్నా పెట్టించక పోతే ఇక, ఆయన పెద్దమనిషి తనాన్ని మే మెలా అర్థం చేసుకో గలుగుతాము ?

రాజా:—ఆ మాత్రం మర్యాద నాకు తెలియ దనుకున్నావా? ఐనా ఆ పెద్దమనిషికి మన ఇంటికి రావటమూ, ఇక్కడ భోం చెయ్యటమూ కొత్తేమీ కాదు. ఇవ్వాళ మాత్రం ఎంత బతిమాలినా లోపలికి రావటం లేదు. కారణం నాకు అర్థం కావటం లేదు——

సుంద:— ఎవర్రా ?

రాజా:— శ్రీధరమే !

రావు:— (కళ్ళు పెద్దవిచేసి భార మేదో తగ్గినట్టు) శ్రీధరమూ?

రాజా:— ఔను. అతను రానందుకు నాకు ఒక్కటే కారణం కనిపిస్తోంది. అక్కయ్య అతనితో పోట్లాడి వుంటుంది, జయ వాలకం చూచి నేను యీ విషయాన్ని గ్రహించాను. అందుకని యీ నాటకానికి అక్కయ్యను కూడా తీసుకొని వెళ్ళి - నేరస్థుల్ని ఇద్దర్నీ విచారించి, శిక్ష చెప్పి- ఇక ముందు ఇంత ఘోరంగా పోట్లాడుకోకుండా ఉండేందుకూ, ఒక వేళ పోట్లాడుకున్నా - నాబోటి చిన్నవాడి శ్రమతో కాకుండా - తామంతటతామే తిరిగి సర్దుకునే షరతునూ ఒప్పించి తీరాలి .... అక్కయ్య ఎక్కడ ?

సుంద:— మేడమీద వుంది.

రాజా:— మే మిద్దరమూ భోం చేసి నాటకానికి వెళ్తాం—

సుంద:— నువ్వు భోం చేస్తూండు, దాన్ని నేను పంపుతాను.

రాజా:— సరే....తర్వగా పంపు.

[రాజా వెళ్ళిపొయ్యాడు]

రావు:— (చిటిక వేసి) ఇప్పుడు నాకో ఉపాయం తట్టుతోంది-

సుంద:— ఇప్పుడా? నాకు ఇందాకనే ఉపాయం తట్టింది—

రావు:— ఏమిటది ?

సుంద:— జయను నాటకానికి పంపుతే—

రావు:— వద్దు....రాజా వాకడు ఉంటాడు కనుక అదంతా సరిగ్గా నడవదు. జయ ఇక్కడే అతనితో మాట్లాడే అవకాశాన్ని కలిపిద్దాం....జయను ఇక్కడికి పంపు........ శ్రీధరాన్ని దాని ద్వారా ఆహ్వానిద్దాం—

[సుందరమ్మ తలవూపి వెళ్లి పోయింది. రావుబహద్దూర్ ఆలోచనలో పడ్డాడు. సుందరమ్మ తిరిగి వొచ్చింది.]

రావు:— జయ వాస్తోందా ?

సుంద:— లేదు. మనం దానికేమీ చెప్ప నక్కర్లేదు. అది అప్పుడే ఉత్తరపు వైపు గుమ్మం దగ్గర శ్రీధరంతో మాట్లాడుతోంది.

రావు:— దానికి యీ సంగతి అప్పుడే ఎలా తెలిసిందో ?

సుంద:— ముద్దుల తమ్ముడు చెప్పి వుంటాడు !

రావు:— దీని ప్రేమ ఘుట్టాలు, నాకు తప్ప మిగతా ఊరంతా తెలుసల్లే వుంది. ఇది తెలుసుకునేందుకు నేనే చివరివాణ్ని మీరందరూ అనుమతించి ఊరుకోంగా లేంది, నా

వొక్కడికీ ఆటంకమూ ఏంలాభం?....మరి జయను నేను పిలుస్తున్నానని చెప్పలా?

సుంద:— దూరంనుంచి చూసి వొచ్చేశాను. వాళ్ల రహస్యాలు వినటమేనా నేను చెయ్యగలిగిన ఘనకార్యం?

రావు:— ఇంకా దొంగదార్లల్లో వొచ్చి గుసగుస లాడటం దేనికీ? సింహద్వారం వుండానే కథానాయకుడు ప్రవేశించ వొచ్చుగా?

సుంద:— ఆ సంగతి కథానాయకుడికి తెలియ వొద్దూ?

రావు:— ఈ పాటికి తెలిసే వుంటుంది....దూరంనుంచే జయను పిలు....

సుంద:— నన్ను ఏం తిప్పుతున్నారండీ!

[ఒక్క క్షణం గడిచింది. సుందరమ్మతో పాటు జయకూడా వొచ్చింది. ఇప్పుడు జయ అందమంతా చూడగలం. జడ వేసుకొని, ఇస్త్రీ చీర కట్టుకొని చక్కగా వుంది. కళ్ళల్లో పూర్వపు చిలిపితనం తిరిగి వొచ్చింది. ముఖం సంతోషంతో కాంతివంతంగా వుంది.]

రావు:— జయా! శ్రీధరం బైట కార్లో ఉన్నాట్ట!

జయ:— ఔను. నేను అతనితో మాట్లాడాను. లోపలికి రమ్మని బతిమాలాను. కాని అతను మిమ్మల్ని చూసి భయపడు తున్నట్టున్నాడు. మీరు పోయి పిలుస్తే వొస్తానంటున్నారు—

రావు:— నేనా? నీ పిలుపు పనికి రాలా?

జయ:— కాని, ఇక ఇక్కడికి రావొద్దన్నది నేను కాదుగా? మీరే! అందుకని మీరే వెళ్ళి పిలవటంలో తప్పేమీ

లేదు. అది ధర్మం కూడాను!

సుంద:— నిజమే!

రావు:— సరే!

[రావుబహద్దూర్ కాళ్లీడ్చుకుంటూ వెళ్ళాడు.]

సుంద:— అతను వొచ్చినట్టు నీకెలా తెలిసిందే?

జయ:— కారు హారన్ను పట్టి గ్రహించాను. తమ్ముడు కూడా చెప్పాడు.... నేను కూడా నాటకానికి వెళ్తాను.

[రావుబహద్దూర్ శ్రీధరంతో తిరిగి వొచ్చాడు. శ్రీధరం వయస్సు ఇరవై వొకటి ఉండొచ్చు. మనిషి చూపరి; అతని దుస్తుల్ని చూసి మనం అతని ఐశ్వర్యాన్ని గ్రహించలేక పోవచ్చు విశాలమైన ఫాలభాగం; అందమైన కళ్ళు. జయ—ఇతన్ని ఎన్నుకోవటంలో పొరపాటేమీ పడలేదనిపిస్తుంది.]

రావు:— ఆ నాటి నుంచీ నే నేదో పెద్ద తప్పు చేసినవాడల్లే బాధతో, భయంతో కుంగిపోతున్నా నంటే నమ్మండి. మీ స్నేహాన్ని నేను పూర్తిగా అపార్థం చేసుకున్నాను. మీరు కనిపిస్తే క్షమా....

శ్రీధ:— (చప్పున మాట అందుకొని) పెద్దలు.... అంత మాట ఉపయోగించకండి. మీరు ఏమన్నా మేము పట్టించుకో కూడదు—

రావు:— కూర్చుండి.... జయా! మీ స్నేహితుడికి 'టీ' తీసుకురా!

[శ్రీధరం కూర్చున్నాడు. జయ టీ తెచ్చేందుకు లేచి నిలబడ్డది.]

శ్రీధ:— (జయను చేత్తో వారిస్తూ) క్షమించాలి. ఇంకో అరగంట కల్లా ఇంటిదగ్గర భోజనం చేస్తాను—

జయ:— ఎవరింటి దగ్గరా ?

రావు:— మన ఇంట్లోనే !

[ఈ స్వాతంత్ర్యాన్ని చూసి శ్రీధరం ఆశ్చర్యంతో మూగ వోయ్యాడు]

రావు:— మీరు అన్యథా భావించకండి ఇక మీరు మామూలుగా వొచ్చి పోతూండండి. మీరు రావటం అతాత్తుగా ఆపేప్పటికి, ఎందరో, ఎన్నెన్ని మాటలో అనుకుంటున్నారట!

శ్రీధ:— ఎవరూ ? ఏమన్నారూ ?

రావు:— అదంతా ఇప్పుడు వొద్దు. లోకులు కాకులన్నారు. మనం ఇంతగా నాగరికతను అభిమానిస్తూ, అనుసరిస్తూ, ముందుకు సాగాక, కాస్తకూ, కూస్తకూ భయపడటం చాలా తెలివి తక్కువ.

జయ:— నాటకంలో మీకూడా పాత్ర వుందా ?

శ్రీధ:— ఏం పాత్రా ?

జయ:— పంచపాత్ర !

[అందరూ నవ్వారు]

జయ:— అంటే ఐదవ పాత్ర అన్నమాట !

శ్రీధ:— చివరకు నా ఖర్మం కాకి నీ దగ్గరే తెలుగుభాష నేర్చుకోవాల్సి వొచ్చేట్టువుంది !

[రాజా రావు వొచ్చాడు]

సుంద:— అప్పుడే భోం చేశావా ?

రాజా:— అంతా తొందరగానే వుంది. అమ్మా ! అక్కయ్య ఏదీ ? (జయను చూసి) అరె ! ఇక్కడే వుందే ! శ్రీధరం

కూడా వొచ్చాడే! నేను బతిమాలుతే రాలేదు.... అక్కయ్య వెళ్ళి బతిమాలుతే ఇట్టే వొచ్చాడు....చూశావుటే అమ్మా?

జయ:— నేను బతిమాలా నని ఎవరు చెప్పారూ?

రాజా:— నీ ముఖమే చెప్తోంది—

జయ:— ఓహో! యీమధ్య థాట్ - రీడింగ్ (Thought Reading) కూడా మొదలు పెట్టావా?

రాజా:— ఆఁ.

శ్రీధ:— రీడింగ్ మాత్రం వుందని నాకు తెలుసు. కాని థాట్ కూడా వుందా అని నా అనుమానం!

[రాజా తప్ప మిగతా అందరూ నవ్వారు]

రాజా:— ఇంకేం - శ్రీధరమూ, నువ్వూ కలిశారంటే త్వరలోనే నన్ను బైటికి పంపేమార్గం చూశారన్నమాటే! జయా! త్వరగా భోం చెయ్యండి....నాకు టైం లేదు—

జయ:— నువ్వు ముందు పోయి రంగు పూసుకో. మేం మెల్లిగా వెనకాల వొస్తాం—

శ్రీధ:— నీకు బహూకరించేందుకు మీ అక్కయ్య మెడల్స్ తెస్తోంది—

జయ:— ఔను బ్రాస్వీ, జర్మన్ సిల్వర్ వీ, కార్డ్ బోర్డ్ వీను—

రాజా:— మీరు వొచ్చి నాకు చేసే సహాయం ఇదన్నమాట? మీరసలు రాకుండా వుంటేనే నయం!

శ్రీధ:— ఎవ్వరూ రాకపోతే ఇక నీ నటనా కౌశిలాన్ని అడగాలా? నీకు నువ్వే మెడలో దండలు వేసుకొని,

ఉప్పొంగి పోతా వనుకుంటూ.

రాజా:— ఒక్కసారి నేషం వేస్తే తెలుస్తుంది - మజా ! ఒడ్డున కూర్చొని మాటలు చెప్పటమంత తేలికా? దిగుతే కాని ప్రవాహపు వేగమూ, లోతూ తెలియవు—

శ్రీధ:— మేము దిగేదాకా ఎందుకు వొస్తుంది? ప్రేక్షకులు కూడా సమయానుకూలంగా పాత్రలు తీసుకుంటారను కుంటూ

రాజా:— ప్రేక్షకులా ?

శ్రీధ:— ఆఁ స్టేజి మీదకు దూకి, ఫోర్సన్ లేకపోయినా, పాత్రధారుల మీద యాక్షన్ ....

[మిగతాది, కొట్టినట్టు గాలిలో చెయ్యి ఆడించటంతో సూచించాడు. రాజా తప్ప మిగతా అందరూ నవ్వుతున్నారు.]

రాజా:— ఇంతేనా ఇంకేమన్నా వుందా ?

జయ:— ఎందుకైనా మంచిది.... వీపు కొక కవచం వేసుకొని వెళ్ళు—

శ్రీధ:— లేకపోతే వీపును ఇన్సూరెన్స్ చేసుకో.

రాజా:— మీ మాటలు వింటూంటే చాలా నిరుత్సాహకరంగా వుంది. నేను వెళ్ళి కారు పంపుతాను. త్వరగా వొచ్చెయ్యండి.

శ్రీధ:— డ్రైవర్ కు ఒంట్లో బాగుండ లేదట....అతన్ని ఇంటికి వెళ్ళిపోనీ.... మేము జట్కాలో వొస్తాంలే—

రాజా:— సరే—

శ్రీధ:— ఒక వేళ మేం రావటం ఆలస్య మౌతుందేమో— మేం వొచ్చేదాకా నాటకం మాత్రం మొదలుపెట్టవొద్దు.

రాజా:— మీా కోసం నాటకం ఆగదు.
జయ:— అది నీ ఇంటరెస్ట్ (Interest) లోనే చెప్పారు—
రాజా:— నా ఇంటరెస్టా ?
జయ:— ఔను.... మేం రాకపోతే నీకు వన్స్‌మోరులూ, చప్పట్లూ ఎవరు కొడతారూ ?

[రాజా తప్ప అందరూ నవ్వారు.]

రాజా:— ఇక మీాతో వేగలేను.... నేను వెళ్తున్నాను.

[రాజా గబగబా వెళ్ళిపొయ్యాడు.]

రావు:— ఆలస్యమైనట్టుంది.... లేవండి.... భోం చేద్దాం—
జయ:— మీారూ, అమ్మా భోం చేసిరండి. మేం తరువాత భోంచేస్తాం —
సుంద:— వంట మనిషికి ఆలస్య మవదటే ?
జయ:— ఆమెను వెళ్ళిపొమ్మను. నేను వడ్డించ గలను.

[రావుబహద్దూరూ, సుందరమ్మా ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు.]

సుంద:— సరే....మీారు లేవండి; మనం భోంచేసి వొద్దాం

[సుందరమ్మ భర్తతో సహా లోనికి వెళ్ళింది]

శ్రీధ:— నన్ను 'మీారు' అనీ 'అండీ' అనీ సంభోదించవొద్దని అనేకసార్లు చెప్పాను—
జయ:— (శ్రీధరం కూర్చున్న సోఫాలోకి జేరి) ఏం ?
శ్రీధ:— అది మన ఇద్దరి మధ్యా మిత్రత్వాన్ని చూపదు—
జయ:— ఆఁ. మరి శతృత్వాన్ని చూపుతుందా ?
శ్రీధ:— భార్యా భర్తల మధ్య వుండే అనురాగాన్ని చూపుతుంది—
జయ:— నా ఉద్దేశం కూడా అదే! ఒకవేళ మీా ఉద్దేశం అది

కాదేమోనని భయపడ్డాను.

శ్రీధ:— బాగా నేవుంది. కాని మనిద్దరికీ ఇంకా వివాహం కాలేదు కదా ?

జయ:— వివాహ మంటే – రంఢోళ్ళు వాయించి, మామిడి తోరణాలు వేళ్ళాడదీసి, యీ బ్రాహ్మలు మంత్రాలు చదువుతూండగా మీరు నా మెడలో మంగళ సూత్రాన్ని బిగించి ముడివెయ్య లేదనా! తెల్లవార్లూ ఇతరులకు నిద్రాభంగంచేసి ఊరి కంతకూ యీ ఘనకార్యాన్ని టమటమా వేస్తూ ఊరేగ లేదనా ? మన యిద్దరిమధ్యా అతి పవిత్రమైన వివాహ మొకటి సంవత్సరం కిందనే జరిగింది. అది నా వివాహం కనుక అందులో ఎవ్వరికీ – చివరకు – నా తల్లితండ్రుల క్కూడా భాగం ఇవ్వను.—

శ్రీధ:— కాని నువ్వు 'మీరు' అనటంవల్ల ఆ విషయాన్ని మిగతా వాళ్లందరూ గ్రహిస్తారు.

జయ:— గ్రహించనీండి. వాళ్ళకు ఇంకో పని లేదు కనుక – మన పనిలో జీతం లేకుండానే భాగానికి వొస్తారు. లోకాన్ని ముయ్యలేం కదా ?

శ్రీధ:— కాని మన వివాహాన్ని యీ సమాజం ఇంకా ఒప్పుకో లేదు.

జయ:— సమాజం తన పనేదో చూసుకోకనో, లేక హాయిగా నిద్రపోకనో— ఇతరుల వివాహాలకు అనుమతి ఇవ్వటమే పనిగా పెట్టుకుందా ? అందువల్ల దానికే ఏం లాభం ?

శ్రీధ:— ఆ లాభ మేమిటో అది మనకు చెప్పదు. అది

తెలిసి ఆ లాభం కోసం మనం కూడా ప్రయత్నిస్తా మేమో నని దాని భయం!

జయ:— అసలు సమాజమంటే ఎవరూ?

శ్రీధ:— ఈ మనుషుల గుంపులు!

జయ:— వీళ్ళకోసం మనం బతుకుతున్నామా? వీళ్ల ఇష్టా ఇష్టాల్తో మనకేం పని?

శ్రీధ:— అట్లా అనవోక. సమాజాన్ని దూషించటం వేరు. దాన్ని ఎదిరించి నిలబడటం వేరూను. అలా తొందరపడి దాంతో విరోధం పూనటం వల్ల లాభం లేదు.

జయ:— దానిమీద నాకేమీ వ్యక్తిగతమైన కోపం లేదు. దానంతట అదే మన వివాహాన్ని ఎందుకు ఒప్పుకో కూడదూ? దానికేం నష్టం? దాని సొమ్మేం పోతుందీ?

శ్రీధ:— ఈ మనుషులందరూ కలిసి యీ సాంఘిక వ్యవస్థను నడుపుతున్నారు. వ్యక్తిగతమైన హక్కుల్ని ఇతరుల బారి నుండి రక్షించుకునేందుకు గాను దీన్ని నిర్మించారు. మనకు దీంతో సంబంధం లేకపో లేదు. ప్రతి మానవుడికీ లోకంలోని ఇతర మానవు లందరితోనూ పనివుంటుంది. ఎందుకంటే— ఏ వొక్కడూ అన్ని విద్యల్నీ, అన్ని పనుల్నీ నేర్వలేడు; పది జీవితాల కాలంలో కూడా నేర్వలేడు! మనం యీ సంఘాన్ని గొంగళీ పురుగుకు మల్లే అసహ్యించుకొని ఎంత దులిపేసుకున్నా— మనకు సంబంధం ఉండనే వుంది.

జయ:— అందుకని— దాని అనుమతి కోసం వేచి కూర్చొని— మన సౌఖ్యాన్ని బలిపెట్టుకో మని మీ సలహా?

శ్రీధ:— మనం అందర్నీ మెప్పించలేక పోవొచ్చు. మనం పొందిన, పొందగలిగిన పరివర్తన లాటిది యీ సమాజంలో వొచ్చి మేల్కొల్పే దాకా— యీ అవస్థ తప్పదు. ఇక్కడ నేను అనేది ఏమిటంటే— కనీసం మన ఆత్మీయుల్నన్నా ఒప్పించి, మెప్పించేందుకు ప్రయత్నిద్దాం, వీళ్ళందరూ——

జయ:— వీళ్ళందరూ అనవోకండి. ప్రభుత్వమే మన వివాహానికి అడ్డుచెప్పలేదు. ఇంక వీళ్ళందరూ ఎవరూ— పానకం లో పుడకలు ?

శ్రీధ:— అంత తేలిగ్గా అంటే—.. ?

జయ:— పోనీ సమాజం అంటే యీ మనుషులే నన్నారు. ఈ చట్టాలన్నీ వీళ్ళ చేతనే చేయబడ్డవి కదా ? ఇందులో మనకూ కూడా భాగం వుంది. ఈ సంఘంలో మనలాటి యువతీ యువకులు ఇరెకా వుండి, మనలాటి సమస్యల్తోనే బాధ పడుతూండ వొచ్చు. వీళ్ళందరి సౌఖ్యాన్నీ చూసే బాధ్యత సంఘానికి లేదా ? బూజుపట్టిన పాతచట్టాల్నీ దుమ్ము దులిపి బాగుచెయ్య కూడదా ? వీటిని సృష్టించింది మనుషులే కనుక— దాని విశ్వామిత్రసృష్టి కీలకమూ కూడా వీళ్ళచేతుల్లోనే వుంది. ఒక జాతి సౌఖ్యమంతా ఇందులో ఇమిడి వుండటం వల్ల ఇలాటి మార్పు వెంటనే ఎందుకు రాదూ ?

శ్రీధ:— వొస్తుంది, కాని కొంత కాలం పడుతుంది.

జయ:— (నవ్వుతూ) ఆ కాల నిర్ణయం కూడా యీ మనుషుల చేతుల్లోదే ఐవుంటుంది.... పోనీ ఎంతకాలమో మీరు

చెప్పండి—

శ్రీధ:— శతాబ్దాలు పట్టవొచ్చు!

జయ:— ఊహుం. మన తరం గడిచి పోతుంది. పైతరం వాళ్ళకో, ఆ పైతరం వాళ్ళకో మనకు కావాల్సిన మార్పులు వొస్తవి. అప్పుడు వాళ్ళకు యీ మార్పు అవసరం ఇంతగా ఉండక పోవచ్చు; ఎందుకంటే ఆ మార్పులు కావాల్సింది యీ తరం వాళ్ళకు కనుక! వాళ్ళను ఎదుర్కొనే సమస్యలు వేరు. వాళ్ళకు కావాల్సిన మార్పులు— మరి రెండు తరాలు గడిచాక కాని రావు. వాళ్ళకూ అది లాభం లేదన్నమాట!

శ్రీధ:— నిజానికి అంతే!

జయ:— అంటే— యీ సమాజం గొప్ప కుంభకర్ణ నిద్రలో వుందన్న మాట? దాన్ని మేల్కొల్పేందుకు బతికివున్న యీ మానవుల శక్తంతా చాలదన్న మాట? వీళ్లందరూ చనిపొయ్యాక— వీళ్ళ అవసరాలు తీర్చేందుకు అది మెల్లిగా కళ్ళు నులుపుకుంటూ నిద్ర లేస్తుం దన్న మాట— అంతేనా?

శ్రీధ:— ('అంతే!' అన్నట్టు తల వూగిస్తాడు)

జయ:— ఇంకొక్క— అనుమానం తీర్చండి. సమాజంలోని వ్యక్తులు బతికే వున్నారా? చచ్చిపొయ్యారా?

శ్రీధ:— చచ్చిపోయేవుంటే — మనం నిర్భయంగా ఉండే వాళ్ళం.... బతికే వున్నారు!

జయ:— బతికివున్న వీళ్ళందరూ— మన శీతల శరీరాలు భూస్థాపిత మయ్యాక— వాటి అస్థిపంజరాలకో, లేక ఆఘాళికో— మార్పులను తెస్తారు. బతికివున్న సమాజం చచ్చిపోయిన

వాళ్ళ కోసం పనిచెయ్యటం కన్న హాస్యాస్పదం లేదు. ఏమంటారూ?

శ్రీధ:— అదీ నిజమే!

జయ:— ఈ సమాజమంత సోమరిపోతు మరి ప్రపంచంలో లేదు. మరి సోమరి పోతుకు భయపడే మానవుడి విజ్ఞానం ఎంతో మీరు ఆలోచించండి.

శ్రీధ:— దాని సోమరితనానికి ఎవ్వరూ భయపడటం లేదు. కాని దాని క్రూరత్వం——

జయ:— అది నిద్రపోతోందిగా! పులి క్రూరమైన జంతువు. కాని అది నిద్రపొయ్యేప్పుడు —— చచ్చిన దాంతో సమానం. చప్పుడు చేసి దాన్ని లేపకుండా మన తోవను మనం వెళ్లిపోవొచ్చు. అలాగే యీ సమాజం గాఢ నిద్రావస్థలో వుంది కనుక— మనం చప్పుడు చేసి దాన్ని బెదరగొట్టకుండా మన తోవను మనం పోవొచ్చు. ఒక వేళ పొరపాటున చప్పుడై దానికి మెలకువ వొచ్చినా ఫర్వాలేదు. ఎందుకంటే— అది మేల్కొనేప్పటికి—— మన తరువాతి తరం వాళ్ళు ఉంటారు. మనం మాత్రం దూసుకు పోగలుగుతాం కదా?

శ్రీధ:— జయా! దీనికి నన్ను సమాధానం అడగక్కర్లేదు. నీ మాటల్లోనే దీనికి జవాబు వుంది——

జయ:— నేను మాట్లాడిందంతా నాకు జ్ఞాపకం లేదు. అదీ కాక— అన్ని మాటల్లోనూ, ఏ కొద్ది మాటల్లో యీ జవాబు వుందో వెతుక్కునే ఓపికా నాకు లేదు. నాకోసం మీరే కాస్త శ్రమ పడండి.

శ్రీధ:— (నవ్వి) మనను యీ సమాజ మేమీ చెయ్యలేక పోవొచ్చు. కాని మన తరువాతి తరం వాళ్లను—

జయ:— వాళ్ల గొడవ మనకు దేనికీ?

శ్రీధ:— వాళ్లు ఆకాశం నుంచి ఊడి పడేవాళ్లనా నీఉద్దేశం? వాళ్లు మన సంతానమే కావొచ్చు—

[ఆలోచనా భారంతో జయ తలవొంచుకుంది. ఒక్క క్షణం నిశ్శబ్దం.]

శ్రీధ:— అసలు కష్టం ఇప్పుడు లేదు. రుచికరమైన పదార్థాన్ని మితిమీరి తినేప్పుడు— అది చేసే చెడుగుల సంగతి తర్వాత కాని తెలిసిరాదు—

జయ:— నేను రుచికరమైన పదార్థాన్నీను, మీరు మితిమీరి తినే వాళ్ళూనా?

శ్రీధ:— కాదు....మన ప్రేమ రుచికరమైన పదార్థం. మన ఇద్దరమూ మితిమీరి తినేవాళ్ళం....ఇక అదిచేసే చెడుగులు: రేపు నీ కడుపునపడే సంతానం—

జయ:— (సిగ్గుతో ముఖం ఎర్రన చేసుకొంటూ) అబ్బ! ఊరుకోండి—

శ్రీధ:— ఇక్కడ సిగ్గు పడే విషయమేమీ లేదు. సిగ్గు బాధను తీసివెయ్యలేదు. ఇప్పుడు మనకు కలిగే సంతానం ఏ కులానికి చెందుతుందీ?

జయ:— మీ కులానికే!

శ్రీధ:— ఏం - నీ కులానికి చెందకూడదా?

జయ:— ఇద్దరి కులాలకూను!

శ్రీధ:— అంటే ఆ మిక్శ్చర్ (mixture)కు ఇక పేరులేదు!

దీన్ని ప్రభుత్వం కూడా ఒప్పుకోదు. ప్రతి ఒక్కరూ ఏదో వొక కులానికి చెందివుండాలని ప్రభుత్వం తెలుస్తోంది—

జయ:— ఐతే మన తప్పులకు మన సంతానమూ బాధ్యులు ?

శ్రీధ:— ఔను. తల్లిదండ్రుల ఆస్తితో పాటు అప్పుకూడా వెంట పడ్డట్టు - ఎవరి కంటా పడకుండా, అయాచితంగా - తల్లి దండ్రుల కులగోత్రాలు కూడా వెంటాడుతయ్.

జయ:— (అమాయకంగా) నిద్రపొయ్యే సమాజానికి ఇదంతా ఎల్లా తెలుస్తుందీ ?

శ్రీధ:— ఎలా తెలియకుండా వుంటుందీ? సమాజం మానవులదే కదా ? మానవుడు తనకు సంబంధించిన సమస్యలకన్న, ఇతరుల సమస్యల్ని పరిష్కరించటంలో ఎక్కువ కాలాన్ని వృధా చేస్తాడు. మన మంచిని మరిచిపోయి, మన చెడును ఎక్కువగా జ్ఞాపకం వుంచుకుంటారు. అదీకాక, సమాజ నిది దొర నిద్ర కాదు; దొంగనిద్ర ! ఒకవేళ అది మన మీదనే పడవొచ్చు. మనం చిక్కకపోతే - మన తరువాతి తరం వాళ్ల మీద పడి - యీ వారా ఆ వారా ఆ పగను తీర్చుకొని తీరుతుంది. ఇక దాని పగ - పులి కన్న తాచుపాము కన్న ఎక్కువది. పులి ఆకలి తీరగానే చంపి వృధా చెయ్యటాన్ని మానుతుంది. పాము — తను పగపట్టిన వ్యక్తిని మాత్రమే చంపుతుంది.... కాని సమాజం తరతరాల వాళ్ళనూ అధఃపతితులుగా చేసేందుకు ప్రయత్నిస్తుంది !

జయ:— పోనీ - దానికి మెలకువ వొచ్చేట్టు చేసి, ఆ శిక్షను నేరం చేసిన మననే అనుభవిద్దాం....

శ్రీధ:— కాని మోత పుట్టించటంవల్ల దానికి మెలకువ రాదు.
జయ:— ఇంకెల్లా వొస్తుందీ ?
శ్రీధ:— మన లాటివాళ్ళు అనేకమంది అహుతవ్వాలి !
జయ:— నరబలా ?
శ్రీధ:— ఔను....దీనికే సున్నితమైన పదం 'ఆహుతి'! అసలు తన భయంకర రూపాన్ని చూసి మనం ఎందుకు భయపడ లేదనీ - ఈ విజ్ఞానపూర్వక విమర్శకు ఎందుకు దిగామనీ అది ఆలోచిస్తూ ఉండి వుంటుంది !
జయ:— అంత పగా! మనుషులకన్న క్రూరమైన జంతువులు—
శ్రీధ:— ఇంతవరకూ సృష్టిలో లేరు !

[జయ ఒక్క క్షణం కళ్లు మూసింది]

జయ:— అబ్బ! కళ్ళు మూసుకున్నాను. అంతా అంధకారమే!
శ్రీధ:— కళ్లు ఉండి కూడా చూడలేని దద్దమ్మలుగానూ, చూసినా గ్రహించకుండా గుడ్డిగా అనుసరించాల్సిన నిష్ప్రయోజకులుగానూ మనను తయారుచేశారు !
జయ:— సమాజానికి కావాల్సింది నరబలే ఐనప్పుడు — ఎవరైతేనేం— మనమే బలవుదాం.... అది మనలాటి ఇతరుల కన్నా ఉపయోగిస్తుంది—
శ్రీధ:— ఇక గత్యంతరం లేకుంటే అదే! అది మొండిగా ఉన్నప్పుడు—మనం శత మొండిగానో, సహస్ర మొండిగానో తయారవక తప్పదు !
జయ:— సమాజం ఇంతమంది నేరస్థుల్ని తయారు చెయ్యకుండా వుండేందుకు నాకో సూక్ష్మమార్గం కనిపిస్తోంది—
శ్రీధ:— ఏమిటది ?

జయ:— ఇప్పుడు 'మంచి' అని చెప్పేదాన్ని చెడుగానూ, 'చెడు' అని చెప్పేదాన్ని మంచిగానూ మార్చి కూర్చుంటే సరి !

శ్రీధ:— (నవ్వి) ఏనాటికైనా అది తప్పదు !

జయ:— అసలు యీ కులనిర్ణయాలూ, ఇందులో ఎక్కువ తక్కువలూ లేకుంటే— లోకం సాగదా ?

శ్రీధ:— ఎందుకు సాగదూ ? ఆ భేదం లేనినాడు సాగలేదు కనుకనా ?

జయ:— మనిషి తెలివితేటల్ని పట్టీ, విజ్ఞానాన్ని పట్టీ— ఎక్కువ తక్కువలు ఉండటంలో న్యాయం వుంటుంది కాని— ఒక కులంలో పుట్టినంత మాత్రాన ఎక్కువ తక్కువల నిర్ణయంలో న్యాయం వుందా ?

శ్రీధ:— ఉన్నదనే వీళ్ళ అభిప్రాయం !

జయ:— ఒకవేళ ఉన్నట్టయితే— ఆ పుట్టటానికి, పుట్టినవాడు బాధ్యుడే కాదు. మన పుటక కోసం మన మేమీ శ్రమ పడలేదు. అదంతా ప్రకృతే చూసుకుంది. ఒక కులంలో పుట్టి— ఇంకేమీ కష్టపడకుండానే— కొంత గొప్పతనాన్ని తమకు తామై అంటగట్టుకునేందుకు— కొంతమంది వేసిన ఎత్తు ఇది !

శ్రీధ:— ఇది నిజమే కావొచ్చు !

జయ:— వ్యక్తిగతమైన సుగుణాలతోనో, లేక గొప్ప కళా ప్రదర్శనతోనో గొప్పతనం రావాలి కాని— ఒక గొప్ప ఇంటి గదిలో, భూమిమీద పడ్డంతమాత్రాన గొప్పతనం రావటంకన్న హాస్యాస్పదం లేదు. ఈకులం అనేది ఒక

బ్రాండ్ లాటిది. అంటే సరుకు మంచిచెడ్డలు విచారించకుండానే— దాని ట్రేడ్ మార్కు చూసి నిర్ణయించేటంతగుడ్డివాళ్ళుగా మనను తయారు చేశారన్నమాట?
శ్రీధ:— ఇందులో వాదనకు అవకాశం లేదు—
జయ:— అబ్బ! నాకు తల తిరిగిపోతోంది.... ఇక యీ ఘోరాలన్నింటినీ చెప్పి పిచ్చెత్తించ వోకండి. మీరు—
శ్రీధ:— మీరు అనొద్దనే నేను చెప్పేది....
జయ:— ఫర్వాలేదు.... నాది ప్రేమ కాదు కనుక మీరేమీ భయపడ నక్కర్లేదు—
శ్రీధ:— (అదిరి) ప్రేమ కాదూ? ఎండమావును చూసి—జలాశయమని భ్రమింప జేస్తున్నా వన్నమాట?
జయ:— అది కాదు....ప్రేమ ముదిరి భక్తయింది—
శ్రీధ:— ఊఁ. తొండ ముదిరి ఊసరవిల్లి అయినట్టా?
జయ:— అంతే! (నవ్వింది)
శ్రీధ:— భక్తన్నమాట? (కళ్లుమూసి) ఓ భక్తురాలా!
జయ:— (మోకరిస్తూ) ఓయ్!
శ్రీధ:— మాట్లాడకుండా విను. ఇక నీ పూజలూ, మంగళహారతులూ, కొబ్బరి కాయలూ, భజనలూ— నాకోసం వృథా చెయ్య నక్కర్లేదు—
జయ:— ఎందుకని స్వామీ? పూజ చేసే కష్టమూ, భజనల శ్రమా పడేదాన్ని నేనుండగా— తమకేం కష్టం కలిగింది ప్రభూ?
శ్రీధ:— ఆ మంగళహారతుల పొగా, భజనల మోతా— అదంతా భరించలేక నా తల పగిలిపోతోంది. నన్నొక

గదిలో బంధించి ఎక్కడికీ పారిపోకుండా చుట్టూ భక్తులు
చేరి— గదిలో గాలినంతట్నీ తామే పీలుస్తూ— నాకు
తలనొప్పి వొచ్చినా— ఆగకుండా, పాటలు పాడి భజ
నలు చెయ్యవొద్దు—

జయ:— అంటే నా పాటలూ, భజనలూ దేవర తలనొప్పికి
కారణాలన్నమాట ?

శ్రీధ:— ఇంకా వేరే చెప్పాలా ?

జయ:— ఎప్పుడూ అమృతాంజనమన్నా అడిగిన పాపాన
పోలేదేం స్వామీ ?

శ్రీధ:— నేను ఒకటిమాత్రం అడుగుతున్నానా ? అసలు
అడిగే అవకాశాన్ని మాత్రం ఎక్కడ ఇస్తున్నారూ ?
మీ గోలలో గొంతెత్తి అరిచినా వినిపించుకునే స్థితిలో
ఉన్నారా ? అదీకాక కన్ను పొడుచుకోవటం ఎందుకూ—
పట్టీలు వేసుకోవటం దేనికీ ? కన్నే పొడుచుకోకుండా
ఉంటే సరిపోతుంది !

జయ:— తమకు తలనొప్పితో పాటు కళ్లజబ్బు కూడా
వొచ్చిందా ?

శ్రీధ:— యీ సాంబ్రాణిపొగకూ యీ హారతికర్పూర ధూమా
లకూ, యీ మంటల వేడికీ కళ్ళు పోవటంలో ఆశ్చర్య
మేముందీ ?

జయ:— అందుకనే తమకు యీ భక్తురాలు కనిపించక—
ఇంతకాలం ఊరుకున్నారు !

శ్రీధ:— కనపడక పోయినా— మీ రణగొణధ్వని వినిపిస్తూనే
వుంది. మధ్యమధ్య మీ ఏకాదశీ ఉపవాసాలూ— అంటే

నామీద మీరు జరిపే సత్యాగ్రహం—

జయ:— అది అజీర్ణం పెరగకుండా చేసే ఉపవాసం స్వామీ!

శ్రీధ:— మీతోపాటు నన్నుకూడా మాడుస్తున్నారు. పచ్చి మేక మాంసాన్నీ, దున్నల మాంసాన్నీ, కోడి మాంసాన్నీ వీలుంటే నరమాంసాన్ని కూడా దెబ్బకు హరించుకోగల శక్తివున్న నా జీర్ణంకోసం సంగతి ఒక్క సైంటిస్టూ (Scientist) గ్రహించక పోవటం చాలా శోచనీయం!

జయ:— స్వామీ! ఐతే నాకు తెలియక అడుగుతాను—తమరు కొన్నాళ్ళపాటు సౌత్ ఆఫ్రికాలో ఉండి వొచ్చారా?

శ్రీధ:— ఏం— అలా అడిగావ్?

జయ:— అక్కడ కొన్ని అడవిజాతులు— నర మాంసాన్నీ జంతువుల పచ్చి మాంసాన్నీ తింటారట! తమకు ఆ నాగరికత బాగా అంటినట్టుంది!

శ్రీధ:— ఒక్క సౌత్ ఆఫ్రికా ఏం ఖర్మం.... లోకమంతటా వున్నాను— నేను!

జయ:— ఈ అంకాలమ్మా, పోలేరమ్మా వీళ్ళకు జంతుబలి ఇస్తూంటారే— తమకూ, వీళ్ళకూ గల అవినాభావ సంబంధం ఏమిటో—

శ్రీధ:— వాళ్ళందరూ నాకు ఏజెంట్లూ సబ్ ఏంజెంట్లూను .... ఒకొక్కప్పుడు అవన్నీ నాదాకా రావు. ఆసంగతి నీలాటి మూఢులు గ్రహించక—

జయ:— ఇవ్వాళ దేవర వొస్తూ వొస్తూ నామీద నేరాల జాబితా తయారు చేసినట్టున్నారు.

శ్రీధ:— జాబితా ఐపోవొచ్చింది. నా మెడలు విరిగేట్టు పూల దండలు వేసి, నాకు ఊపిరాడుతుందో లేదో నన్న జ్ఞానమన్నా లేకుండా— మొహమంతా గంధంపూసి, పూలలో నన్ను పూడ్చిపెట్టేస్తున్నారు....ఇదంతా మీకు మీరై గ్రహించుకుంటారేమో నని ఇన్నాళ్ళూ ఊరుకున్నాను. కాని ఇక భర్తురాలు వొదిలే మార్గం లేదు కనుక— నేనే భర్తురాల్ని వొదిలించుకునే మార్గాన్ని వెతుక్కొచ్చాను—

జయ:— ఆ మార్గం యేమిటో యీ దీనురాలికి—

శ్రీధ:— వరాలిచ్చి వొదిలించుకోవటం. నీ కోర్కెల్నీ నీ లోటుపాటుల్నీ — వరస నెంబరు ప్రకారం వెంటనే అప్లికేషన్ రాసి—

జయ:— ఎయిర్ మెయిల్ (Air mail) లో పంపుకుంటాను—

శ్రీధ:— ఈ పుణ్యకాలమందు—

[ద్వారంలో సుందరమ్మా, రావుబహద్దూరూ పకాలున నవ్వుతున్నారు. శ్రీధరం చప్పున కళ్ళు తెరిచి సిగ్గుపడ్డాడు. జయా, శ్రీధరమూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. జయ లేచి నిలబడ్డది]

సుంద:— చెప్పండి........చెప్పండి.... ఈ పుణ్యకాలమందు—? ప్రాప్టింగ్ (Prompting) కావాలా ?

జయ:— మనం పోయి భోంచేద్దాం రండి.

[జయ శ్రీధరాన్ని లాక్కుంటూ గబగబా వెళ్ళిపోయింది. రావు బహద్దూరూ, సుందరమ్మా వొచ్చి కూర్చున్నారు.]

సుంద:— అమ్మాయి మీ రిచ్చిన స్వాతంత్ర్యాన్ని సక్రమంగా ఉపయోగించుకుంటోంది.

రావు:— సమయాన్ని పట్టి సహించి ఊరుకున్నాను. నేను

దాని నిపుణతను పరీక్షిస్తూంటే— అది నా ఓర్పును, పరీక్షిస్తూన్నట్టుంది !

సుంద:— ఐతే మీరు చూపే యీ దయ సమయానుకూల మన్నమాట ?

రావు:— నీకు తెలియనట్టు ?

సుంద:— నాకు తెలుసులెండి. ఇతర అనుమానాలేవీ లేకుండా— కుండ పగల కొట్టినట్టు మీరే చెప్పేశారు ! కాని యీ దయ నాకు సంబంధించింది కాదు. జయకు సంబంధించింది - కనుక యీ సంగతి దానికి చెప్పటం అవసరం—

రావు:— అందువల్ల ఏం లాభం ?

సుంద:— మీ పని కాగానే యీ దయను ఉపసంహరించుకుంటారు. అందుకని మీ పని కాకుండా చూస్తూ, కాలయాపనచేస్తే - యీ స్వాతంత్ర్యాన్ని ఎక్కువ కాలం ఉండేట్టు చేసుకుంటుంది—

రావు:— పెళ్ళికి పోతూ పోతూ పిల్లిని చంక పెట్టుకు పోయ్యాట్ట! నీ వ్యవహారం చూస్తే నా ముందు కాళ్ళకే బందాలు వేసేట్టున్నావ్ ! నువ్వు నా కొకటి సహాయం చేస్తేచాలు—

సుంద:— ఏమిటది ?

రావు:— సహాయం అంటే సహాయం కాదు. నువ్వు నాకు హాని చెయ్యక పోవటమే - నాకు చెయ్యాల్సిన మేలు. నువ్వు నా పక్షాన మాట్లాడక్కర్లేదు. అసలు మాట్లాడకుండా ఊరుకుంటే - అదే పదివేలు.... ఏం ?

సుంద:— (మాట్లాడదు)

రావు:— జవాబుకూడా ఆలోచించాలా ?

సుంద:— (మౌనం)

రావు:— ఎప్పుడూ ఎవరికి హాని చేద్దామా అనే ఆలోచనలు ఉన్న వాళ్ళకు - ఊరుకోవటం కష్టమే నను కుంటాను.

సుంద:— (జవాబు లేదు)

రావు:— మూగ నోము పట్టావా ?

సుంద:— (మాట్లాడదు)

రావు:— (విసుగుతోనూ, కోపంతోనూ) నేను యీ కుర్చీల తోనూ, యీ సోఫాలతోనూ, యీ గోడల్తోనూ మాట్లాడటం లేదు; నీతో మాట్లాడు తున్నాను. మూగ దానిలాగు కూర్చొని నన్ను విసిగిస్తా వెందుకూ ?

సుంద:— నేనేమీ మాట్లాడక పోవటమే మీకు చేసే మేలన్నారుగా ?

రావు:— ఓహో ! ఏమి నీ సతీత్వము ? మరి రెండు మూడు శతాబ్దాల్లో 'సతీ సుందరమ్మ' అనే పురాణగాథ యీ దేశంలో ప్రచారంలోకి వొస్తుందని భ్రమిస్తున్నా వల్లే వుంది ! ఇలా ఆలోచించేందుకు నీబుర్రలో ఏముందో కాని——

సుంద:— నాబుర్రలో మట్టి వుందని మీ అభిప్రాయం ?

రావు:— సరిగ్గా గ్రహించావ్ !

సుంద:—అలా సరిగ్గా గ్రహించగలిగే బుర్రలో మట్టి వుండేందుకు అవకాశం వుంటుందో, మెదడు అనేది వుండేందుకు అవకాశం వుంటుందో —— మెదడుగల మీ బుర్రతో ఇంకొక్కసారి ఆలోచించండి !

రావు:— ఈ నవ్యసాహిత్యం చదివి సంసార స్త్రీలు అందరూ

ఇలా చెడిపోతున్నారు!

సుంద:— ఒక జాతి మొత్తంలోని స్త్రీసౌందర్యం చెడగొట్టే సాహిత్యంలో ఎంత గొప్ప శక్తివుందో మీరు ఆలోచించటం లేదు— ఒక జాతిని పాలించగల దానికి మీరా గొప్పతనాన్ని ఇవ్వలేక పోతున్నారన్నమాట?

రావు:— నీతో వాదించటం అనవసరం—

సుంద:— వాదనలో విసుగూ, కోపమూ—ఓటమిని తెలియజేస్తయ్!

రావు:— ఏనా జయ అంటే నీకింత అభిమాన మనుకోలేదు. సవితితల్లి ప్రేమ అనుకునేవాణ్ణి!

సుంద:— ఎందుకు ఉండకూడదూ? అది ఆరునెల్ల బిడ్డగా ఉన్నప్పుడు నేను యీ ఇంటికి గృహిణిగా వొచ్చాను. ఆనాటినుంచీ దాన్ని పెంచాను. బిడ్డలమీది ప్రేమంటే ఏమిటో-జయ నాకు నేర్పింది. కన్నతల్లిని కాకపోయినా— నాకు దానిమీద పెంచిన ప్రేమవుంది. మనం కనని యీ కుక్కల్నీ, పిల్లుల్నీ, పాడిసీ అభిమానంతో చూడటంలా? అదీకాక 'జయ' ఆడది. నేనూ ఆడదాన్నే!

రావు:— ఇది స్వజాతిమీది అభిమాన మన్నమాట?

సుంద:— జాతేకాదు, ఆ యీడులో ఆడది ప్రేమించటం అంటే ఏమిటో నాకు తెలుసు. అలాంటి బాధ నాకు స్వానుభవం వుంది. అందుకని, నేను దానికి సానుభూతి చూపగలుగుతున్నాను—

రావు:— అసలు ఆ యీడులో 'ప్రేమ' కు అర్థమే తెలియదు. ఏదో మనస్సు పొంగటంతోటే— ఇదే ప్రేమ అయి

వుంటుందని తలిచి పిచ్చిలో పడిపోతారు.

సుంద:— పోనీ పిచ్చే అనుకుందాం. కాని యీ 'పిచ్చి' కి ఒక దారీ, డొంకా వుంది కనుక— పిచ్చాసుపత్రికి పంప నక్కర్లేదు. మనందరికీ అర్థమయ్యే రకం పిచ్చే ఇది. ఇంట్లో పిచ్చి వ్యక్తిని పెట్టుకొని— మీరు ఎంత అపాయ కరమైన స్థలంలో నివసిస్తున్నారో ఆలోచించండి.

రావు:— ఆ పిచ్చి— పిచ్చివ్యక్తికి చేసే హానికన్న— చుట్టూ ఉన్నవాళ్ళకు ఎక్కువ హానిని చెయ్యదు. అదీ కాక— వొదిలించుకునే మార్గం ఏదీ ?

సుంద:— ఉంది....

రావు:— ఎక్కడా ?

సుంద:— దానికి పెళ్ళి చేసెయ్యండి—

రావు:— క్షణాలమీద ఎలా ?

సుంద:— ఏం ? వరుడు— శ్రీధరం సిద్ధంగానే వున్నాడు. ఇందాక మీరు— జీవితాన్ని పెట్టుబడిదారీ విధానంకిందికి లాగారు. తక్కువ పెట్టుబడితో, తక్కువ శ్రమతో— ఎక్కువ లాభాన్ని సంపాయించటం— పెట్టుబడిదారీ విధానంలోని గొప్ప నిపుణత్వం. ఇప్పుడు మీరు వరుడికోసం దేశమంతా తిరిగి శ్రమపడ నక్కర్లేదు. గొప్ప ఇంటి పిల్లను— తక్కువ కట్నానికి, భాగ్యవంతు లెవరూ చేసుకోరు. కాని శ్రీధరం యీ ప్రేమ ప్రవాహంలో కొట్టుకు పోతున్నాడు కనుక— ఆ మైకంలో ఇట్టే వివాహం చేసుకుంటాడు. మీకు రెండు విధాలా లాభం !

రావు:— 'ప్రేమ'! ప్రవాహమూ ! ఆన కట్టాను ! (నవ్వి)

ఈ యీూమలో నాకైనా ఆ పదానికి అర్థం తెలుసా అనేది అనుమానమే! అది అలావుంచి - అసలు ముఖం ఎరుకలేని వాళ్ళమధ్య జరిగే వివాహమే జీవిత సౌఖ్యా నికి దారి తీస్తుంది—

సుంద:— ఎందుకనీ?

రావు:— ఇద్దరూ కొత్తవాళ్ళు కనుక, ఒకళ్లను ఒకళ్ళు అర్థం చేసుకునేప్పటికే చాలా కాలం గడిచి పోతుంది. అసలు ఆ నాటికి మృత్యువాత పడతారు కూడాను. ఎదుటి మనిషిని అర్థం చేసుకోని వాళ్ళమధ్య విరోధం ఉండే అవకాశం లేదు. అందుకని జీవితకష్టాల్ని జయించేందుకు యీ రకం వివాహాలు ఎక్కువగా ఉపయోగ పడతాయ్. ఇక రెండో రకం వివాహాలు - మధ్య పరిచయం ఏర్పడుతుంది. యువక రక్తం కనుక - ఆ పరిచయం, త్వరత్వరగా పూర్తిగా పెరిగి పోతుంది. వాళ్లమధ్య వివాహం జరగ్గానే - ఇది వరకే ఒకళ్ల నొకళ్ళు పూర్తిగా అర్థంచేసుకొని వుంటారు కనుక - చప్పున విరోధాలు రగిలేందుకు ఎక్కువ అవ కాశం వుంటుంది. అందుకనే మన పూర్వులు మహా మేధావు లంటాను. ఈ సూక్ష్మ మార్గం కనిపెట్టి - ఉత్తర ధృవం నుంచి వరుణ్ణీ, దక్షిణ ధృవంనుంచి వధువునూ తీసుకొచ్చి ముడివేసేవాళ్ళు; ఒకళ్ళ నొకళ్ళు అర్థం చేసు కునే లోపలే - వారి ఆత్మలు శరీరాల్ని వొదిలే స్తూండేవి!

సుంద:— ఆగండి.... కాని 'ప్రేమ' ను అనుభవిస్తూ, అది 'ప్రేమ' అని తెలియకపోతే - దాని రుచిని పూర్తిగా

అనుభవించలేం కదా ?

రావు:— ఔను—

సుంద: అందుకని ప్రేమించుకున్నవారి మధ్య జరిగే వివాహంలో ఎక్కువ సౌఖ్యం వుంటుంది. ఎందుకంటే వీళ్ళకు - తమ మధ్య 'ప్రేమ' వుందని తెలుసు. కాని మీరు ఇందాక చెప్పిన రకం వుందే - హిమాలయాలం నుంచి వరుణ్ణీ, కన్యాకుమారీ అగ్రంనుంచి వధువునూ తెచ్చి ముడివేసే రకం వివాహం—వాళ్ళ కసలు ప్రేమా పుట్టదు; ఒకవేళ పుట్టినా అది 'ప్రేమ' అని కూడా తెలియదు. విషయం తెలుసుకొని అనుభవించాలి కాని — అసలు అమాయకత్వమే సౌఖ్య ప్రదమైన దెలా అవుతుందీ? ఒకవేళ— అదే నిజమైతే — మనకన్న ఏమీ తెలియని కుక్కలు నయం !

రావు:— పెద్దల ధర్మ సూత్రాల్ని అలా ఎదిరించ కూడదు! వాళ్ళ గౌరవ మర్యాదల్ని జాగ్రత్తగా కాపాడాలి కాని— వర్ణాంతర వివాహం చెయ్యమనటంలో సబబులేదు. ఈ వంశం అంటే ఏమనుకున్నావ్ ? మా తాత యజ్ఞం చేశాడు—

సుంద:— మిమ్మల్ని చెయ్యవొద్దని ఎవరూ అనలేదు, అన్నట్టు పాడు రేషనింగ్ వొకటి అడ్డం వొస్తుంది కాబోలు !

రావు:— మా నాన్నగారంటే— సోమయాజిగారు........ఎంత గౌరవం !

సుంద:— అందుకనే ! యీ కుటుంబంలో గౌరవం అనే పదాన్నీ, దాని మోతనూ వినలేక విసుగు పుడుతోంది.

ఆ భారం అత్యధికమై పోయింది కనుక— దాంట్లో కొంత భాగమన్నా వొదిలించుకోవాల్సిన సమయం వొచ్చింది....

రావు:— గౌరవాన్ని సంపాయించేందుకు శతాబ్దాలు కావాలి కాని, అగౌరవాన్ని సంపాయించేందుకు క్షణాలు చాలు! తాజ్‌మహాలు కట్టేందుకు ముప్పై సంవత్సరాలు పట్టింది కాని— పడగొట్టాలంటే— ముప్పై నిమషాల్లో పునాది లోవి నాలుగు ఇటుకలు తీస్తే చాలు—

సుంద:— అప్పుడు మొత్తం మీద నే పడుతుంది!

రావు:— అందుకనే అలాటి పిచ్చిపని చెయ్యకూడదు.

సుంద:— మీరు సంపాయించే అగౌరవాన్ని చూసేందుకు మీ తాతలూ, ముత్తాతలూ బతికి లేరుగా?

రావు:— అందుకనే, దేన్నీ ఏదీ సంపాయించుకోలేని తాత ముత్తాతల గౌరవ మర్యాదల్ని కాపాడాల్సిన బాధ్యత బతికివున్న మనమీద వుంది!

సుంద:— మీ గౌరవాన్ని పంచుకునే ఆ తాత ముత్తాతలు, మీ అగౌరవాన్ని పంచుకునేందుకు రారూ?

రావు:— వాళ్లు చచ్చిపోయిరి! మన అగౌరవాన్ని చూసి వాళ్ళు స్వర్గంనుంచి కంటనీరు పెడతారు....

సుంద:— ఔను. ఆకాశంలోంచి ఆ నీరంతా అప్పుడప్పుడు వడగళ్ల రూపంలో భూమిమీద పడుతూంటుంది!

రావు:— అంత తేలిగ్గా మాట్లాడ వోక. మా తాతా, తండ్రీ.... ....

సుంద:— (మాట మధ్యలోనే అందుకొని) ఆ మృత జీవుల గొప్పతనాలు నాకు చెప్పవోకండి. వాళ్లు గొప్పవాళ్ళు.

మహా గొప్పవాళ్ళు. సరేనా? వాళ్లు ఎంత గొప్పవాళ్లయినా ఇప్పుడు ఎవరికొ_వాలి? ఇండియన్ హిస్టరీలో చదువుకొని, ఆనందించ వొచ్చు. మీగొప్పతనం ఏమన్నా వుంటే శెల వివ్వండి.

రావు:— కుటుంబ గౌరవాన్ని పట్టే—మన గొప్పతనం కూడా వుంటుంది—

సుంద:— (నవ్వి) అంటే స్వతహాగా మీకేమీ లేదన్నమాట? మీ తాతల ఆస్థిపాస్తుల్లాగే—ఏ వీలునామా సహాయమూ లేకుండా వాళ్ళు కష్టించి సంపాయించిన గౌరవాన్ని, మీరు కూడా పంచుకున్నారన్నమాట? తాత తండ్రుల్ని అడ్డం పెట్టుకోవాల్సిన ఖర్మం పట్టిన—ఆ గౌరవం ఎంత అల్పమైనదై వుంటుందో ఆలోచించండి!

రావు:— గౌరవం సంపాయించలేం కనుక, అగౌరవాన్ని మూటగట్టమంటావ్?

సుంద:— ఎందుకంటానూ? మీరు జయచేత చేయించేపని మహా గౌరవపాత్ర మైనది కాదూ?

రావు:— ఇక్కడి సందర్భం వేరు. మొదటినుంచీ బీదరికాన్ని అనుభవించటం బాధా కరం కాదు; ఆ బీదరికం అల వాటై పోయివుంటుంది. కాని మధ్యలో వొచ్చే బీదరికం నుంచి తప్పించు కోవటం చాలా కష్టం. దాన్ని భరించ లేం కూడాను!

సుంద:— అందుకని జయ ప్రేమను అమ్మయినా—

రావు:— ఇవ్వాళో రేపో నాలుగు కాళ్లసవారీ ఎక్కేందుకు సిద్ధంగా వున్న ముసలివాళ్ళకూ, భార్యను పోషించే

శక్తన్నా లేని దద్దమ్మలకూ - తమ కూతుళ్ళను అమ్ము కునే ధర్మాత్ముల కన్న, నేను నెయ్యిరెట్లు మేలు! వాళ్ళ పిల్లలు జీవితమంతా తల్లిదండ్రుల జీవానికి పడి ఏడు స్తూంటారు. ఈ పాలఘాటు రకం కన్న నేను ఎక్కువ దుర్మార్గమేమీ చెయ్యలేదు....

సుంద:— దుర్మార్గుడు, పరమ దుర్మార్గుణ్ని చూసి ఊరట చెందినట్లు——

రావు:— (కోపంతో) నీతో మాట్లాడుతే - నోటికి ఏదివాస్తే అదల్లా వాగుతావ్! నన్ను దుర్మార్గు డన్నావ్! ఇంకా సేపుంటే....నీ చేత తిట్లుతినటం కన్న - పోయి హాయిగా పడు కోవటం మేలు!

[రావుబహద్దూర్ చరచరా వెళ్ళిపొయ్యాడు. ఒక్కక్షణంగడిచింది. సుందరమ్మ తన ఒంటరి తనాన్ని భరించలేక మెల్లిగా కాళ్ళీడ్చు కుంటూ వెళ్ళిపోయింది.
ఒక్క క్షణం నిశ్శబ్దం.
జయా, శ్రీధరమూ వొచ్చారు]

జయ:— కూర్చోండి....అమ్మా, నాన్నా పోయి పడుకున్న కున్నట్టున్నారు. నేను పోయి తాంబూలం తెస్తాను.

శ్రీధ:— ఇవ్వాళ అతిథి మర్యాద ఇంత ఎక్కువగా వుందేం?

జయ:— పది రోజుల్నుంచీ వేచి కూర్చున్న అతిధికి ఇదాక మర్యాదా?

[జయ వెళ్ళి పాందాం తెచ్చింది. జయ ఇచ్చిన వక్కపొడి నము లుతూ, ఆమె రాసి ఇచ్చే ఆకుల్ని నములుతున్నాడు]

శ్రీధ:— పై వారంలో నేను హైదరాబాద్ వెళ్తున్నాను జయా!

జయ:— ఎందుకూ ? ఎన్నాళ్లుంటారు ?

శ్రీధ:— కనీసం ఆరునెలలన్నా ఉండాలి. నాన్నగారు పోవటంతో అక్కడి వ్యాపారమంతా విచ్ఛిన్నమై పోయింది. అందుకని, నేనే స్వయంగా వెళ్ళి- ఆ వ్యాపారాన్ని వీలైతే సక్రమమార్గంలో నడిచేట్టుగానో, లేక మొత్తం అమ్మేసుకొని రావటమో చెయ్యాలి.

జయ:— (విచారంగా) ఆరు నెల్లు!.... హైద్రాబాద్!...మరి పరీక్షలో ?

శ్రీధ:— నువ్వే చదువు మానావని నేనూ మానాను. నాకసలు యీ చదువుమీద 'ఇంటరెస్ట్' (interest) పోయింది.

జయ:— నన్నుకూడా మీతో తీసుకు వెళ్ళండి.

శ్రీధ:— నిన్నా ? అవివాహితవు, గొప్ప ఇంటి కన్యవు - నిన్ను వెంటపెట్టుకొని వెళ్ళటం, రేపుఅనేక అపవాదుల భారంతో, మనతో పాటు నీ తల్లిదండ్రుల కూడా తలవొంపులు- ఇదంతా చాలా యాతన! నువ్వు ఏ బెడ్డింగువో, సూటు కేసువో ఐతే ఇంత ఇబ్బంది వుండేది కాదు !

జయ:— పోనీ ఒక పని చెయ్యండి. ఈ కన్యను వివాహమాడి తీసుకుపోండి___

శ్రీధ:— ఆ వివాహం మనిద్దరం యీ సమాజంమీద జరిపే విప్లవం! విప్లవం అనుకున్నప్పుడే జరిగేటంత తేలికది కాదు! తొందరపడి విప్లవంలో దూకటం- అపజయానికే దారి తీస్తుంది. తగినంత కాలం వేచి ఉన్నాక- పరిస్థితులు పక్వానికి రాగానే చేసే విప్లవం జయానికే దారి తీస్తుంది.

జయ:— ఈ జయకే దారి తీస్తుందనండి—

శ్రీధ:— పేరులోనే జయాన్ని పెట్టుకు కూర్చున్నావు !

జయ:— ఆరునెలలు! అంతకాలం మిమ్మల్ని విడిచి నేను వుండలేను. మొన్న యీ పదిరోజులూ మీరు కనిపించక పోతే— ఎంతో బాధపడ్డాను. ఏడ్చి ఏడ్చి సగమై పోయ్యాను! అద్దంలో చూసుకొని నన్ను నేనే గుర్తు పట్టలేని స్థితికి వొచ్చాను. ఎన్ని కబుర్లు చేసినా మీరు యీ ఇంటి చాయలకే రాలేదు. మీరింత పిరికనుకో లేదు—

శ్రీధ:— అది పిరికి కాదు జయా! సమయం కానప్పుడు చేసే మొండిధైర్యం మూర్ఖత్వ మవుతుంది. ఇక్కడికి వొచ్చిపోవటం— మీ నాన్నగారి అనుమానాలకు కారణం అవుతుందనీ, వారి కోపం నామీద పనిచెయ్యదు కనుక— నీమీదికి మారి, నిన్నింకా బాధిస్తారనీ రాలేదు. నన్ను అపార్థం చేసుకోవోక.

జయ:— నాన్నగారికి కోపం వొస్తే బాధపడేదాన్ని నేను. మీతో గడిపే ఆనందమయ క్షణాలముందు—నాన్నగారి కోపంలో అనుభవించే బాధ లెక్కకు రాదు.

శ్రీధ:— కాని నాకల్లా అనిపిస్తుందా? నీ సౌఖ్యంలో భాగం పంచుకునేందుకు సిద్ధపడ్డ నేను— నీ బాధలో మాత్రం భాగం పంచుకోనా? ఆ పదిరోజులూ, నాకు మాత్రం పిచ్చెక్కినట్టు లేదనుకున్నావా? ఇవ్వాళ యీ నాటకం మిషతో నిన్ను కలుసుకుందా మనుకున్నాను. కాని మీ నాన్నగారే మన స్నేహాన్ని అర్థం చేసుకోగలి

గారు.... అన్నట్టు నాటకానికి వెళ్దామా ?

జయ:— ఈపాటికి అది సగానికి పైగా ఐపోయి వుంటుంది. మీకు జయకన్న నాటకమే ఎక్కువ—

శ్రీధ:— నాటకానికి నాదృష్టిలో అసలు విలువే లేదు. కాని జయ ఆనాటకానికి రావటంవల్ల— నాటకానికి ఆవిలువ ఇవ్వాల్సి వొచ్చింది.

జయ:— అలాగే- జయతో కలిసి హైద్రాబాద్ పోవటం వల్ల- హైద్రాబాద్ ప్రయాణానికీ, ఆరు నెల్ల హైద్రాబాద్ నివాసానికీ విలువరాదా ?

శ్రీధ:— వొస్తుంది. కాని జీవితంలో అవసరాన్ని పట్టి- కొన్ని సౌఖ్యాల్ని త్యాగం చెయ్యాల్సి వుంటుంది....ఐనా ఆరు నెలలేకదా ?

జయ:— మీ దృష్టిలో- ఆరు నెలలంటే- ఆరు గంటలా ? లేక ఆరు నిమిషాలా ? అంత తేలిగ్గా అన్నారు !

శ్రీధ:— నేను నీకన్న తక్కువ బాధను అనుభవిస్తున్నా నని ఎందుకు అనుకుంటావ్వూ ?

జయ:— నేను అనుకునేందుకు- మీ మాటలు సహాయ పడు తున్నయ్. అది నా తప్పుకాదు.

శ్రీధ:— మన యీడులోని యువతీ యువకులకు ముందు వెన కల ఆలోచనలు వుండవు. అందులోనూ ప్రణయ ఘట్టాల్లో వారి మెదడు అసలే పనిచెయ్యదు. దేన్నయినా, ఏదైనా సరే ఆ ప్రేమకోసం త్యాగం చేసేందుకు వెనుదీయము, ఇంతా ఏడుస్తే త్యాగంచేసి సంపాయించే సౌఖ్యం విలువ- చాలా తక్కువ ! ఆ త్యాగం చేసేది- జీవితమంతా కష్ట

పడ్డా సంపాయించ లేనిది కావొచ్చు! త్యాగానిక్కూడా సందర్భమూ, సమయమూ వుంది. ఆకలైనవాడు కాయను కోసి ఆకలి తీర్చుకోవటంకన్న- పండుకోసం పరుగెత్తటంలో అర్థం వుంది—

జయ:— మరి పండు దొరక్కపోతే ?

శ్రీధ:— అప్పుడు కాయ ఉండనే వుంది. త్యాగ్యం చేసేముందు, ఒకటికి నాలుగుసార్లు ఆలోచించటం మంచిది.

జయ:-- మరి పండుకోసం వేచి కూర్చొని జీవితమంతా పాడు చేసుకోమంటారా ?

శ్రీధ:— అనను. కాని, వేచి కూర్చున్నందుకు ఫలితం వుండక పోదు. అసలు జీవితం విలువ ఏమిటో చూడు; మనం బతికేది యాభై ఏళ్లు ఉండొచ్చు. అందులో సగం రాత్రులు. ఆ రాత్రుల్లో మళ్ళీ సగం చీకటి రాత్రులు. ఇక మిగతా కాలంలో — బాల్యంలోనూ, వార్థక్యంలోనూ, రోగాలతోనూ ఎంత కాలం వృథా పోతుందో చూడు. సరైన లోకజ్ఞానం సంపాయించి మనం ఎవరిమో తెలుసుకునేపాటి విజ్ఞానం సంపాయించే ప్పటికి, జీవితమే అంత్యదశలోకి వొచ్చేస్తుంది. ఇక ఇందు లోనే సౌఖ్యమూ, బాధలూను. ఈ స్వల్పజీవితం కోసం అతి స్వల్పమైన సౌఖ్యంకోసం త్యాగం చెయ్యటం— తక్కువ విలువగల వస్తువుకు — అనేకరెట్లు ఎక్కువ వెలను ఇవ్వటమే అవుతుంది.

జయ:— జీవితం అంత స్వల్పమా ?

శ్రీధ:— కాదా ? జీవితమంటే తెలుసుకోగలిగేప్పటికే

మరణం వాస్తోంది. తెలుసుకొని జీవించేందుకు అవతల ఇంకో జీవితం లేదుకదా ?

జయ:— ఒక్కొక్క వ్యక్తికి ఒకే వొక్క జీవితం. ఈ కాస్తా పాడుచేసుకుంటే—అవతలంతా అగాధం! ఆలోచించి, యీ స్వల్పకాలాన్ని వృథా చేసుకోవటంకన్న— చేతికి అందినంత సౌఖ్యాన్ని అనుభవంచేస్తే తృప్తన్నా వుంటుంది....అనుభవించి నంతవరకే దక్కేదల !

శ్రీధ:— స్వల్ప విషయాన్నే జాగర్తగా ఆలోచించాలి— ఎందుకంటే—జీవిత సౌఖ్యమంతా, అతి స్వల్ప విషయాలమీాద ఆధారపడి వుంటుంది.

జయ:— స్వల్ప విషయాలమీాదనా ?

శ్రీధ:— ఔను. నాకు సామ్రాజ్యం లేదనీ— కనీసం ఒక జమీా లేదనీ, చివరకు కోటి రూపాయలన్నా లేవనీ బాధ పడటంలేదు. నేను ప్రేమించిన యువతి ఇతరకులానికి చెందిందవటం వల్ల సమాజంలోని ప్రతి వ్యక్తీ అర్హమైన వివాహ కాండకు—నాకు అర్హత లేకుండా పోయింది. జీవిత సౌఖ్యం ఎంత స్వల్పవిషయం మీాద ఆధారపడి వుంటుందో చూశావా ?

జయ:— మీారు చిత్రంగా మాట్లాడుతున్నారు. వివాహాన్నీ, హైద్రాబాద్ ప్రయాణాన్నీ అతి స్వల్పవిషయాల కిందకు లాగారు.

శ్రీధ:— స్వల్ప విషయాల్లోనే మన కష్టాలు ఎక్కువని చెప్తున్నాను. నాకు వెనకాల ఎవ్వరూ అండలేరు. నన్ను నేనే కాపాడుకోవాలి—

జయ:— అందుకనే - నన్ను పెళ్లాడుతే - మీకు అండగా వుంటాను కదా ?

శ్రీధ:— కాదన్నానా ? కాని, నీ భారాన్ని కూడా మోసే ముందు- నాపునాదిని గట్టి చేసుకోనీ ఆరు నెలలు! ప్రేమ ఫలాన్ని పొందేందుకు - ఇంతమాత్రం కష్టమూ, శ్రమా, కాలమూ, ఓర్పూ, బాధా ఖర్చవకుండా వుండదు. ప్రేమ కథల్లో చదివినంత తేలికదా ? నా మాట విను; నీకు సరైన జవాబు తోచకపోతే కనీసం నా మాటల కన్నా విలువ నివ్వు. నన్ను అపార్థం చేసుకోవాక ఏం.... నా మాట వింటావా ?

(తలవాల్చిన జయ గడ్డం పట్టుకొని బతిమాలుతూ) వింటావా - జయా ? ఏం ?

జయ:— (ప్రణయ కోపంతో) నన్ను బతిమాలకండి !

శ్రీధ:— జయా! ఇవ్వాళ నువ్వు నా ప్రేమను పరీక్షిస్తూన్నట్టు వుంది. నీకు అపాయం లేని ఏ పరీక్షకైనా నిలబడగలను' నీ కోసం నేను అపజయాన్ని అంగీకరిస్తున్నాను. నన్ను క్షమించు——

జయ:— మీరేం తప్పు చేశారూ క్షమించేందుకు ? తప్పు లన్నీ నావే !

శ్రీధ:—ప్రేమ పరీక్షలో జయముందు అపజయాన్ని పొందాను—

జయ:— ఇప్పుడు ఓడినా - ఇంకో సమయంలో ప్రయత్నించి ఉత్తీర్ణుల వొచ్చు.

శ్రీధ:— ఆ సమయం కూడా ఎంత దగ్గర్లో వుందో నని ఆలోచిస్తున్నాను. అది ఇప్పుడే ఐతే - నా కన్న అదృష్ట వంతు

డుండడు.

జయ:-- నిజమా ?

శ్రీధ:— ఇదేమన్నా కలా అబద్ధమాడేందుకు ?

జయ:— ఐతే ఇప్పుడే పరీక్షించ మంటారా ?

శ్రీధ:— నేను సిద్ధంగా వున్నాను....నా ప్రాణాన్ని ఇమ్మన్నా-

జయ:— నరబలి కోరేందుకు నే నేమన్నా కాళికాదేవి అవతార మనుకున్నారా ?

శ్రీధ:— మరింకా ఆలస్యం దేనికీ- అడుగు

జయ:— నాకు డబ్బు కావాలి - అప్పుగా !

శ్రీధ:— (నవ్వి) ఇంతేనా ? నేనే నీవాణ్ని కనుక, మనిద్దరి మధ్యా అప్పులూ, నప్పులూ ఉండేందుకు వీల్లేదు—

జయ:— ఎంతో తెలుసా ?

శ్రీధ:— ఇంతని చెప్పవొద్దు ఆ మొత్తం నేను ఇవ్వలేనిదన్నా కావొచ్చు. లేక ఆ మొత్తం తక్కువైతే నీ మాట విలువకూడా తగ్గిపోవొచ్చు.

(జేబులోంచి చెక్ బుక్ తీసి, దస్కత్ చేసి ఆమెకు ఇస్తూ) ఇదుగో చెక్ ! ఈ రోజున బాంకులో ముప్పై రెండు వేల చిల్లర వుంది. నేను అంకె వెయ్యను. నీకు కావాల్సింది నువ్వే వేసుకో. నాకు ధనరూపంలో ప్రస్తుతం ఉన్నదంతా త్యాగం చెయ్యగలిగాను—

జయ:— నాకు అంత అక్కర్లేదు—

శ్రీధ:— నీకు ఎంత కావాలో తెలుసుకునే అవసరం నాకు లేదు. ఒక వేళ అది ఇంతకన్న తక్కువ మొత్తమే ఐతే-నా కున్నదాంట్లో ఒక భాగాన్నే త్యాగం చెయ్యాల్సి

వుంటుంది. ఇప్పుడు నేను నెగ్గానా జయా ?

జయ:— నెగ్గారు.... కాని ఒక స్త్రీ ప్రేమకు ఇంత విలువా ?

శ్రీధ:— ఏ వస్తువుకు, ఎవరు, ఎప్పుడు, ఏ అధికారంతో ఇంత విలు వని నిర్ణయించారు ? నిర్ణయించినా అది మిగతా అందరికీ ఒకేవిధంగా ఎల్లా చెల్లుతుంది ? అందులోనూ స్త్రీ ప్రేమను ఎవరు విలువ కట్టగలరూ ? దాని విలువ ఒక తాజ్ మహాల్ ! సూర్యుడు అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం !

జయ:— మీ సర్వస్వాన్నీ హరించిన నామీద మీ కింకా విలువ వుంటుందా ?

శ్రీధ:— ఎందుకు వుండదూ ? నా సర్వస్వాన్నీ ఇచ్చి కొనుక్కున్న వస్తువును అంత తేలిగ్గా విసిరి పారేసుకోగలనా ? ఒక వేళ ఆ వస్తువును పోగొట్టుకుంటే— ఇంత విలువైన వస్తువును పోగొట్టుకున్నందుకు ఎంత బాధ పడతానో ఆలోచించు.

జయ:— నామీద మీకింత అభిమాన మనుకో లేదు. ఇప్పుడు నేను తీసుకున్న డబ్బు — నాకోసం కాదంటే మీరు ఆశ్చర్యపడతారు—

శ్రీధ:— ఇందులో ఆశ్చర్యం ఏముందీ ? డబ్బుంటూ వున్నాక అది చెయ్యగలిగిన ఘనకార్యం ఖర్చవటం తప్ప ఇంకేమీ లేదు. ఆఖర్చు నా చేతిమీదుగానే ఐతే నా ఒక్కడికే తృప్తివుండేది. కాని అది నాచేతిమీదుగానూ, నీచేతి మీదుగానూ ఖర్చయి —ఇద్దర్నీ తృప్తిపరుస్తోంది. అది ఎవరికైతే నాకేం ?

జయ:— చాలా అవసరమై తీసుకున్నాను. ఇది మానాన్న గారి మంచినీ, మర్యాదనూ కాపాడేందుకు—

శ్రీధ:— నాకు ఇంకేమీ చెప్పవొద్దు జయా! ఈ డబ్బు మీ నాన్నగారి పరువునే కాపాడగలగటం కన్న చెయ్య గలిగే మహత్కార్యం ఇంకేమీ వుండదు!

జయ:— మీరెంత ఉదారులు!

శ్రీధ:— నాలో ఉదరమైతే వుంది.... కాని ఉదారత్వాన్ని నువ్వే ప్రవేశపెట్టావ్.

జయ:— మీరు జయను చూశారు: కాని జయను జయగా చూడలేదు. ఆమె గుణాల్ని ఉన్నవి ఉన్నట్టుగా కాక— మీకు నచ్చిన, కావాల్సిన విధంగా చూస్తున్నారు. నాకు ఇంకో సందేహంకూడా కలుగుతోంది. అద్దంలో మీరు పాపను చూసుకున్నట్టు—నాలో మీ సుగుణాల్ని చూసు కొని తృప్తిపడుతున్నట్టున్నారు!

శ్రీధ:— ఇది నిజమే ఐనా ఇబ్బంది లేదు. ప్రేమికులు— బాధాకరమైన యీ నగ్నసత్యాన్ని వొదిలి— ఊహా ప్రపంచంలోని ఆకాశంలోకి వెళ్ళగలరు. ఈ సౌఖ్యానికి కారణాల్ని వెతకటంకన్న చప్పున ఆసౌఖ్యాన్ని అనుభ వించి ఊరుకుంటారు—

[జయ మాట్లాడలేదు. కళ్ళు మూసుకుంది బహుశా తలపుల్లో— శ్రీధరం అన్న ఆకాశ విహారంకోసం ప్రయత్నిస్తూండి వుంటుంది ఒకక్షణం నిశ్శబ్దం. మూసివున్న జయకళ్ళవెంట నీరువొస్తోంది]

శ్రీధ:— జయా!

జయ:— (నిద్ర మేల్కొన్నట్టు) ఆఁ.

శ్రీధ:— ఏడుస్తున్నావా? (ఆమె కన్నీటిని అద్దాడు)

జయ:— లేదు.... (శ్రీధరం చేతిని నిమురుతూ) మీరు నాపక్కనే ఉండగా నాకళ్ళకు ఆనంద బాష్పాల్ని తప్ప — విషాద బాష్పాల్ని రాల్చే ధైర్యం వుంటుందా?

శ్రీధ:— నీకు నిద్రవొస్తూన్నట్టుంది.... (గడియారం చూసి) పదకొండు గంటలైంది. ఇక వెళ్ళి నిద్రపో .... నేను వెళ్ళనా?

జయ:— నన్ను విడిచి వెళ్తారా? వెళ్ళొద్దు; మిమ్మల్ని వెళ్ల నీను. బైట చూడండి; ఆ చందమామ— వెన్నెల చిరు నవ్వుతో ఎంత దేదీప్యమానంగా వెలుగుతున్నాడో!

శ్రీధ—: (చూసి) కాని చందమామకు మబ్బులు అడ్డంపడ్డవి....

జయ:— ఆగండి....(క్షణం నిశ్శబ్దం) ఇప్పుడు చూడండి; చంద మామ మబ్బుల్ని దాటేశాడు. ఇంత అందమైన ప్రకృతిని వొదిలి....

శ్రీధ:— ప్రకృతి అందానికి అలవాటైపొయ్యాను. పుట్టిన నాటినుంచీ చూసే చంద్రుడిలో కొత్తదనం ఏముందీ? చందమామకు విలువ— నీవల్ల! అందుకోలేని ఆ చంద మామనూ, పోగుచేసి మూటగట్టలేని ఆవెన్నెల వెలు గునూ గూర్చి బాధపడటంకన్న—నాపక్కనే కూర్చున్న (జయను తాకుతూ) యీ చందమామనూ, ఆమె నవ్వే వెన్నెల చిరునవ్వునూ—

జయ:— వొదిలి ఇంటికి వెళ్తారా?

శ్రీధ:— వెళ్ళను....ఏం చెయ్యమనీ ఆజ్ఞ?

జయ:— ఇలాగే కవిత్వం మాట్లాడుతూ యీ రాత్రిల్లా

నాదగ్గరే ఉండండి. వారంరోజుల్లో వెళ్ళిపోతున్నారు. ఈ వారమన్నా ఆనందిద్దాం....

శ్రీధ:— జయా ! నువ్వు నాకింత సులభంగా ఎలా దొరికావా అని ఆలోచిస్తున్నాను. నీలాంటి దేవతకోసం జీవితమంతా కష్టపడ్డా- అది తక్కువ వెలే అవుతుంది—

జయ:— జీవితమంతా ఆనందించినా అనండి—

శ్రీధ:— ఒక్క జీవితం కాదు; ఎన్నయితేనేం ?

జయ:— మన మింక మేడమీదికి వెళ్ళిపోదాం....రండి....

[శ్రీధరాన్ని చెయ్యిపట్టుకొని నడిపించుకొని వెళ్ళిపోయింది.
క్షణం నిశ్శబ్దం.
సుందరమ్మా, రావుబహద్దూరూ చెరో వైపునుంచీ వొచ్చారు]

సుంద:— రాజా ఇంకా రాలేదల్లే వుంది—

రావు:— (వినిపించుకోకుండా) వీళ్ళు మేడమీదికి వెళ్ళినట్టున్నారు. లైటుకూడా ఆర్పలేదు— చూశావా ?

సుంద:— ఆ స్థితిలో మీరు వుంటే- మిగతా లైట్లన్నీ వెలిగించి, మేడమీది గదిలోకి మారుగా- ఆ మైకంలో వీధిన పడేవాళ్ళు ! వాళ్ళ ఆనందం చూస్తే- నాకు మహదానందంగా వుంది—

రావు:— ఉంటే- పోయి పడుకొని కలలు కను !

సుంద:— నిజమైన జీవితంలో ఆనందంలేని నాలాంటి నిర్భాగ్యురాలు అంతకన్న చేసేదేముందీ ?

[సుందరమ్మ వెళ్ళిపోయింది. జయ వొచ్చింది]

జయ:— నాన్నా ! ఇక్కడే వున్నారా ? లైటు ఆర్పిపోదామని వొచ్చాను.

రావు:— సరే.... నాపని ఏం చేశావ్ ?

జయ:— (చెక్ ఇస్తూ) ఏమౌతుందోనని భయపడ్డాను. నవ్వుతూ ఇచ్చేశారు.

రావు:— నువ్వు అడుగుతే ప్రాణాన్ని ఇవ్వడటమ్మా ? ఆడ దాని శక్తి - ఆమెకే తెలియదు కనుక లోకం ఇంకా యీ మాత్రంగా వుంది!

అరె! బ్లాంక్ చెక్కే!

జయ:— ఔను. డబ్బు మొత్తం వేసేందుకూడా నిరాక రించారు. బాంకులో ముప్పై రెండువేల చిల్లర—

రావు:— ఐతే - ఆ మొత్తానికి రాద్దాం!

జయ:— అదేమిటి నాన్నా! మీకు కావాల్సింది ఇరవై వేలని చెప్పారు. అంతవరకే రాయటం న్యాయం—

రావు:— (తను బైట పడి పోకుండా) అంతవరకే రాద్దాం నువ్వు ఏమంటావో నని అలా అన్నాను.

జయ:— అంతకన్న ఎక్కువకు రాయకండి. సానుభూతి చూపే వాడున్నాడని కష్టాన్ని తెచ్చుకోవటం - యీ వూరి ఫైర్ ఇంజన్ను నమ్మి, తమాషాకు, ఇంటికి నిప్పు పెట్టుకోవ టం లాటిది!

రావు:— ఔనమ్మా - ఔను.... నాకు అర్థమైంది.

[రావుబహద్దూర్ వెళ్లిపొయ్యాడు. రాజారావు వొచ్చాడు. చాలా అలసి పోయినట్టు కనిపిస్తున్నాడు]

జయ:— రాజా! నాటకంలో మన వీపు ఏమైందీ?

రాజా:— (వీపు తడువుకొని వీప్ is safe! నాటకమంటే నాట కమా! యమగా వుంది! నా నటనా చాతుర్యాన్ని వేయి

నోళ్ళు కొనియాడారు. మీరు నాటకానికి రాకపోవటం—
మీ దురదృష్టం!

జయ:— మేము రాలేదని ఎవరు చెప్పారూ?

రాజా:— వొస్తే నాటకంలో నా వీపు ఏమైందో, నా నోటి
నుంచే వినే ఖర్మం ఎందుకు పడుతుందీ? మీరే చూసి
గ్రహించుకునే వాళ్ళు!
అబ్బ! నాకు నిద్ర తూలిపోతోంది.
[సోఫాలో పడుకొని కళ్ళుమూశాడు]

జయ:— రాజా!

రాజా:— ఊఁ. మాట్లాడ వొకవే—

జయ:— లేవరా - పక్క-మీద పడుకుందు కానివి—

రాజా:— (మూలుగుతూ, సన్నగా) ఊఁ.

జయ:— అబ్బ! నేను ఒక్క-తెనూ ఎత్తుకుపోలేనురా! శ్రీధ
రాన్ని కూడా పిలవమంటావా?

రాజా:— (ఎగిరిపడి) శ్రీధరం ఇంకా ఇక్క-డే వున్నాడూ?
అతను కూడా ఇక్క-డికి వొస్తే- మీ రిద్దరూ జేరి ఇక
యీ రాత్రి నన్ను నిద్రపోనివ్వరు. నాటకంలో వీపు
ఏమైనా- ఇక్క-డమాత్రం మీరు మోగించి, ఆనంది
స్తారు. కనుక వెంటనే పలాయనమంత్ర పఠనం—
[రాజా పరుగెత్తుకొని వెళ్ళాడు; జయ నవ్వుకుంటూ, ఫాన్ ఆపి
తలుపు వేసి, లైటు ఆర్పి, చీకట్లో మెల్లిగా నడిచి వెళ్ళిపోయింది]

—♦ తెర ♦—

# II

తొమ్మిది నెలలు గడిచినయ్. అదే హాలు. ఎక్కువ మార్పేమీ లేదు.

చిందర వందరగా వున్న కుర్చీలూ, బల్లలూ, టేబిల్ మీద విరజిమ్మ బడ్డ పుస్తకాలూ, మొదలైనవి ఈ ఇంటిలోని వ్యక్తులు ఏ విషయం లోనూ ఎక్కువ శ్రద్ధ చూపకపోవటాన్ని రూపిస్తున్నయ్. గోడలు బూజుతోనూ, నేలమీది తివాసీ దుమ్ముతోనూ అలంకరించబడినయ్. బైట గాలి జోరుగా వీస్తూండటంవల్ల — మూసివున్న కిటికీ తలుపులు ఊండి వుండి శబ్దం చేస్తున్నయ్.

హాలులోని సీలింగ్ లైటు వెలిగించి ఉండటంవల్ల ఇది రాత్రయి వుంటుంది. ఆ లైటు, మానవశక్తి వృధా కాకుండానే ఉయ్యాల ఊగు తూండటంవల్ల బైట గాలి వేగం ఎక్కువగానే ఉండి ఉంటుంది.

ఒక్క క్షణం నిశ్శబ్దం. రావుబహద్దూర్ గారు చేతులో ఉత్త రాల కట్టతో ప్రవేశించాడు. ఆయన ముఖకళను పట్టి చూస్తే — క్రితం సారి మనం చూసినదానికన్న ఎక్కువ ఆందోళన పడుతూన్నట్టు తోస్తుంది. ఆయన దుస్తుల్లో ఎక్కువ మార్పేమీ లేదు. ఇంట్లో వున్నా స్వెటర్ వేసుకోవటంవల్ల — వాతావరణంలో చలి ఎక్కువగా వున్న దని మనం అర్థం చేసుకోవచ్చు.

రావుబహద్దూర్ గారు చేతులోని ఉత్తరాల్ని విప్పి అక్కడక్కడ చదువుతూన్నాడు. ఆయన ముఖం క్షణ క్షణానికీ నల్లబడుతూండటం వల్లా, ఆయన కూర్చున్న కుర్చీలోనే క్రమంగా ముడుచుకు పోతూండ టం వల్లా — ఆ చదివే విషయం ఆందోళనకరంగానూ, బాధాకరం గానూ ఉండి వుంటుంది.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

సుందరమ్మ రివ్వున వీచే గాలితోపాటే ప్రవేశించి, శరీరాన్ని ముడుచుకుంటూ కూర్చుంది.]

సుంద:— (భర్తవైపు చూడకుండానే) అబ్బ! ఏం గాలీ!

రావు:— (ఉత్తరాల కట్టను అవతలికి నెట్టుతూ) గాలివాన మనకు చాలా దగ్గర్లోనే వుందని సాయింత్రం అనుకుంటు న్నారు.

సుంద:— ఏమిటో దీర్ఘంగా చదువుతూన్నట్టున్నారు ?

రావు:— చదివిన కొద్దీ నా హృదయంలో రేగిన గాలివాన విశ్వరూపాన్ని దాల్చుతోంది. ఎంత పెద్దదైనా, బైటి గాలిదుమారాన్ని భరించ వొచ్చు కాని— హృదయాన్నే ముక్కలు చేసే యీ గాలివాన——

సుంద:— మీ హృదయంలోని గాలివానతో యీ ప్రపంచా నికి సంబంధం లేదు; ఒకవేళ అది అంత ప్రమాదకర మైనదే ఐతే— అది మీ ఒక్కర్నే బాధించ గలుగు తుంది! కాని బైటి గాలిదుమారం — అది వ్యాపించే స్థలంలోని ప్రజల్నీ, పాడిపంటల్నీ, ఆస్థిపాస్థుల్నీ నేలమట్టం చేస్తుంది——

రావు:— నీకు నామీద సానుభూతి ఏనాడో పోయింది.

సుంద:— పోలేదు. మీ హృదయంలోని పెనుగాలి విష యంలో నేను ఒక్క వ్యక్తికే సానుభూతి చూపాల్సి వుంటుంది. కాని బైటి గాలివిషయంలో - అది బాధించే అనేక వేలమంది ప్రజలకు మానవ రూపాన సానుభూతి చూపాల్సి వుంటుంది. అందుకని మీకు చూపే సాను భూతి ఒక చిన్నభాగమే కనుక - అది మీకు కనిపించక పోవొచ్చు. అదీకాక ప్రమాదావస్థలో ఉన్నవాళ్ళే సాను భూతికి అర్హులు——

రావు:— నేనిప్పుడు ప్రమాదావస్థలో లేనంటావ్ ?

సుంద:— ఇందులో కూడా వొక తిరుగుడు వుంది. ఆ ప్రమాదావస్థే మరీ ఎక్కువైతే - ఆ సానుభూతి కూడా దండగే! అంటే చనిపోయిన వ్యక్తికి కార్చే సానుభూతి కన్నీరు వృధా! మంచి ఆరోగ్యవంతుడికి అసలు సానుభూతి అవసరమే వుండదు; ఎందుకంటే అతనిది ప్రమాదావస్థే కాదు. పోతే మధ్యరకంగా వేళ్ళాడే వ్యక్తికి - అంటే చావు బతుకుల మధ్య మునగానాం, తేలానాంగా వున్న వ్యక్తి ఒక్కడే సానుభూతికి అర్హుడు. ఇప్పుడు మీ స్థితి ఏమిటో చెప్పండి.

రావు:— నా స్థితి ఏమిటో, ఇప్పుడు ఏం చెయ్యాలో బొత్తిగా అర్థమవటం లేదు. బైటిగాలి దుమారం, వానను తోడు తెచ్చుకున్నా - కొన్ని గంటల్లోనే పోవచ్చు. కాని నా హృదయంలోని గాలి - హృదయం పోతేనే కాని పొయ్యేట్టు లేదు.

సుంద:— ఏదో వొక మందువుంది కదా? అసలు మీ హృదయాన్ని కదిలించగల గాలివాన ఉన్నదా అని నా అనుమానం!

రావు:— (కోపంతో) దీని అర్థం?

సుంద:— ప్రకృతి సృష్టించగల గాలివానకన్న మానవులు ఊహించి కల్పించుకోగల ఇమిటేషన్ గాలివాన ఏ విధంగానూ బలవత్తరంగానూ క్రూరంగానూ ఉండేందుకు వీల్లేదు. బైటగాలికి చలించని మీరు, ఏ ఇమిటేషన్ గాలివానకు చలించారో తెలుసుకోవాలని వుంది. మీ హృద

యాన్ని కదిలించ గలిగినఆ గాలివాన-నిజంగా పూజ్యమే అవుతుంది—

రావు:— అంటే నా హృదయం అంత రాయి అని నీ ఉద్దేశం?

సుంద:— మీలాంటి ఐశ్వర్యవంతులూ, పూజ్యులూ, సమాజంలోని పెద్దతలలూ - రాతి హృదయాన్ని కలిగి వుంటారనే సాహసం నాకు లేదు.

రావు:— మరి ?

సుంద:— రాయి చాలా విలువ తక్కువ వస్తువు. అదీ కాక అది అనుకునేటంత ఘన పదార్థం కూడా కాదు. కొన్ని శతాబ్దాలు గడుస్తే సూర్యరశ్మి ఉష్టమే దాన్ని కరిగించ గలుగుతుంది. అందుకని - మీది వజ్రహృదయం అనటం సమంజసం !

రావు:— ఈ ఇంట్లో వాళ్ల మాటలూ, చేతలూ చూస్తూంటే ఒళ్ళు భగభగమని మండి పోతుంది.

సుంద:— ఒళ్ళుమండనీ వోకండి. మీరు శరీరాన్ని ఫైర్ ఇన్సూరెన్ చెయ్యలేదన్న సంగతి మరిచిపోయినట్టున్నారు ఐనా అంత కోపం రావాల్సినంత అవసరం లేదే ?

రావు:— (ఉత్తరాల కట్టను పైకెత్తి చూపుతూ) ఇందాక జయ పెట్టె వెతుకుతూంటే యీ ఉత్తరాలు దొరికినయ్. వీళ్ళను ఇంతదూరం దాకా రెచ్చగొట్టి, ప్రోత్సహించే అవకాశాన్ని కల్పించటంలో నీక్కూడా భాగం వుందని నాకు తెలుసు—

సుంద:— ఔను.... నేనే! జయ ప్రేమను మూడ్పైరెండు వేల రూపాయిలకు శ్రీధరానికి అమ్మింది నేనే! ఆ నేరాన్ని

మీ మీద పెట్టుకునేందుకు భయం కనుక— నా మీదికి తోసెయ్యండి. పాపాల భైరవిని నేనొకదాన్ని యీ ఇంట్లో ఉట్టి కట్టుకొని ఊరేగుతున్నానుగా !

రావు:— (జవాబుకోసం తన్నుకొని) పోనీ... పోనీ.... ఏదో బుద్ధి గడ్డితిని అన్నాను. ఇందులో నీకేమీ సంబంధం లేదు.... సరేనా ? నాకు కలిగే ఆశ్చర్యం ఏమిటంటే — జయ విషయం నీకు చీమకుట్టినంత బాధకూడా కలిగించక పోవటం—

సుంద:— జయ మనిషి. అదేం— తేలూ, పామూ, పులీ, సింహం జాతిలోది కాదు. మరి దానివిషయం నాకేం బాధా ?

రావు:— దాని సంగతి లోకానికి ఏమాత్రం తెలిసినా— ఆ అగౌరవాన్ని భరించటం కన్న— మనం తలలు నేల బాదుకొని చావటం మేలు !

సుంద:— 'మనం' అనవొకండి. ఇంత మాత్రానికే చచ్చి పోగలిగినంత అల్పప్రాణి కాదునాది. అది చాలా మొండి బండ స్వరూపం !

రావు:— అది కనిపిస్తూనే వుంది.... శ్రీధరం విషయం ఏం చెయ్యాలో ఎంతగా ఆలోచించినా తేలకుండా వుంది—

సుంద:— ఇంకా ఆలోచించే పుణ్యకాల మంతా గడిచే పోయింది. శ్రీధరం తన పనిని తొమ్మిది నెలల క్రితమే పూర్తిచేశాడు. ఇక మిగిలిన భాగాన్ని జయ యీరాత్రే పూర్తిచేస్తుంది—

రావు:— (కోపంతో) ఏమిటీ !

సుంద:— మీకు కలగబోయ్యే ముద్దుల మనముడో, మనుమ
రాలో—

[ఉయ్యాల ఊపినట్టు చేతుల్ని ఆడించింది]

రావు:— మీరందరూ సిగ్గు విడిచేశారు. వీళ్లు ఇంత నిర్భ
యంగా, సిగ్గులేకుండా యీ ఉత్తరాలూ రాసుకున్నారంటే-

సుంద:— ఒకపని చెయ్యండి. సిగ్గుపడుతూ, భయపడుతూ
బతికేందుకు అలవాటు పడ్డ మనకు— నిజంగా నిర్భయ
మైందీ, సిగ్గువిడిచి చెప్పేదీ— నవ్య సాహిత్యం కొరవ
గానే వుంది. ఆ కట్ట కట్టా ప్రెస్‌కు పంపి, నిర్భయప్రణయ
లేఖలు' అనే టైటిల్‌తో ఒక పుస్తకం అచ్చువేయిస్తే—
యీ జాతికి ఎంతో సేవచేసిన వారవుతారు!

రావు:— అసలు ఆమాట అనేందుకు నీకు సిగ్గులేదూ?

సుంద:— జయా, శ్రీధరమూ కలసినా సిగ్గును పూర్తిగా ఇది
వరకేవొదల గొట్టారు. ఐనా ఇది స్త్రీ పురుష సహజం. ఇందు
లో సిగ్గు పడేందుకు తగిన కారణం నాకేమీ కనిపించటం
లేదు.

రావు:— నీమాటలు వింటూంటే నాకు పిచ్చెక్కుతూన్న ట్టని
పిస్తోంది. ఈ కట్టలో రాజాగాడు రాసిన ఉత్తరాలు
కూడా వున్నయ్. ఈ వ్యవహారమంతా వాడికీ తెలుసన్లే
వుంది—

సుంద:— ఏమో!

రావు:— ఇదంతా రహస్యంగా వుంచుదామని వీణ్ణి మెడ్రాస్‌లో
చదవేసి—దసరా శెలవలకూడా రాకుండా చేసినా—
అంతా ఉత్తరాలద్వారా తెలిసేపోయింది!—

సుంద:— ఈనాటి యువతీ యువకులు ముందడుగులు వేసే వాళ్ళు—

రావు:— ఏడిశారు!.... వీళ్లసలు పుట్టక పూర్వమే నేను ముందడుగులు వెయ్యటం మొదలుపెట్టాను—

సుంద:— ఔను.... వయస్సులో మీది వీళ్లకన్న చాలా ముందడుగ్గానే వుంది. మీరు ముందడుగులే వేసేందుకు ఇంకో గొప్ప కారణం కూడా వుంది—

రావు:— ఏమిటది?

సుంద:— మీ తలలో కళ్ళు వెనకవైపు కాక, ముందువైపున అమర్చబడి వున్నయ్ కనుక, మీరు అడుగులన్నీ జాగ్రత్తగా చూస్తూ ముందుకే వెయ్యటం ప్రారంభించారు —

రావు:— (కోపంతో ఉత్తరాల కట్టను విసరి కొట్టి) వీళ్ళ సాహిత్యం మండా! ఇందులో కవిత్వం కూడాను! వీళ్ళందరికీ ఒకేరకం - మందులేని రోగం వ్యాపించింది. ఈ పవిత్రమైన గృహంలో ఇలాటి పాడుపని—

సుంద:— ఔను....మీలాటి పవిత్రుల వల్లనే—

రావు:— సరే....నావల్లనే జరిగిందయ్యా - ఏదో ఉపాయంగా తప్పించుకోవాలి కాని—

సుంద:— తప్పించుకోకుండా మీ కెవరు అడ్డం పడ్డారూ?

రావు:— నా మాట వినేవాళ్లెవరూ? శ్రీధరంగాడి కల్లిబొల్లి కబుర్లకు లొంగిపోయిన జయ నాకు ఎదురు తిరగటం మొదలుపెట్టె! ఆ పీడ కాస్తా వొదిలించుకునేందుకు మందు తెస్తే - తిని చేతులు కడుక్కుంటే ఇంత అవస్థ ఉండేది కాదుకదా?

సుంద:— ఇది పాడుపని అని మీకు తెలిసే - ఆ మందు ప్రభావం నాకూ, దానికీ కూడా తెలియకుండా దాన్ని ఉపయోగించారు. కాని జయ - తెలివిగల పిల్ల కనుక కనిపెట్టి వెంటనే డాక్టర్ దగ్గరికి వెళ్ళి విరుగుడు తిన్నది—

రావు:— దాని తెలివిని నువ్వు మెచ్చుకోవాలి !

సుంద:— డాక్టర్ ఎన్నివిధాల అడిగినా అది మీ పేరు బైట పెట్టలేదు దాదాపు మీ తలను కాచినందుకు మీరు కూడా దాని తెలివిని మెచ్చుకోవాలి ! ఆనాటి నుంచీ మీరు ఏ మందు తెచ్చినా అది తాగటమే లేదు. ఆమధ్య మూడు రోజులూ జ్వరంతో నన్నా బాధపడ్డది కాని, మీరు తెచ్చిన మందును రుచికూడా చూడలేదు.

రావు:— అదే - మాట వినటంలేదని నేను అనేది !

సుంద:— దానికి మాటల్ని ఆలోచించుకునే శక్తి లేనన్నాళ్లూ మీ మాటల్నే వినటంకన్న గత్యంతరం లేకపోయింది. ఇక తెల్లారే లోపల అది బిడ్డతల్లి అవుతుంది. తన బిడ్డకు మాటలు చెప్పి, వాటిని వినేట్టు చెయ్యాల్సిన బాధ్యత దానికి వుంటుంది. ఇంకా మీ మాటలు వినే అవసరం దాని కేం వుందీ ?

రావు:— నీ ఊహల్లోని దుర్మార్గం దాని ఊహల్లోని దుర్మార్గానికి ఏ విధంగానూ తీసిపోదు కనుక - నీకు ఆ తప్పు కనిపించదు. మీ ఇద్దరి మధ్యా యీ రకం సోదరీభావం పెరిగిపోయింది !

సుంద:— అంతా మీ ఇష్ట ప్రకారమే జరుగుతుందా ? వాళ్లిద్దరి మధ్యా స్నేహాన్ని బాగా ముదర నిచ్చారు. ఈ

నారుకు నీకు పోశారనేమాట మరచిపోయి - యీ నాటి దాని ఉడల్నీ, ప్రమానుల్నీ చూసి అనవసరంగా భయపడు తున్నారు! ఆడది సృష్టికారిణి. జయ తన విధిని నిర్వ హిస్తోంది....అంతే!

రావు:— పెళ్ళి కాని పిల్ల బిడ్డతల్లి కావటంలో ఆశ్చర్యమేమీ లేకపోవచ్చు. కాని యీ సమాజం! సంఘంలోని మనుషు లందరూ నీలాటివాళ్లే ఐనా బతికి పొయ్యేవాణ్ని! ఇది ఏ కాస్తపొక్కి - యీ వంశ గౌరవమంతా యీ ఒక్క అపవిత్ర కార్యంతోనూ నేలపాలై పోతుందో నని భయ పడి ఛస్తున్నాను.

సుంద:— జయకు పెళ్ళిచేసి నట్టయితే యీ బాధ మీకు తప్పేది!

రావు:— ఆ మాత్రం ఆలోచన నాకు తోచకనా? గర్భిణీ స్త్రీని కన్యగా చూపి పెళ్లిచేస్తే తరువాత ఎంత రాసా భాసో తెలుసా? అత్తవారి తాలూకు మనుషులు యీ కాస్తా టమ టమా వాయించే వాళ్ళు. జయ జీవితంతో పాటు మనందరి జీవితాలూ కూడా పాడై పొయ్యేవి. వంశ గౌరవాన్ని యీ నాలుగు గోడల మధ్యా - తక్కువ శక్తితో నన్నా నిలబెట్టటం కాస్త తేలికేమో కాని — పెళ్ళిలో ఊరేగించి - అందరి ఎదుటా యీ వంశగౌర వాన్ని తూచి చూపి - దీన్ని చెడుగొట్టే అవకాశాన్ని యీ సమాజానికి కల్పించటం కన్న బుద్ధి తక్కువ పని ఉండదు. అదీకాక, అంత తేలిగ్గా, క్షణాలమీద జయను పెళ్ళి చేసుకునే వాడు దొరకొద్దూ?

సుంద:— ఎందుకు దొరకదూ ? హైద్రాబాద్‌కు ఉత్తరం రాసినట్లయితే శ్రీధరమే వరుడుగా దిగి కూర్చునేవాడు.

రావు:— వాడి సంగతి నాకు చెప్పవోక. కుల గౌరవమూ, సాంఘిక మర్యాదా పోయ్యే పక్షంలో - దాన్ని ఇప్పటి కిప్పుడే చేతులారా పోగొట్టుకోవటంకన్న - మరి కొన్నాళ్ల పాటన్నా నిలబెట్టుకోవటం మేలు. ఈ సందర్భంలో ఎలాగైనా యీ సంగతి బైటికి పోకుండా తొక్కిపట్ట గలమేమో కాని - జయను శ్రీధరాని కిచ్చి పెళ్ళి చెయ్యాటమంటే - దేశమంతా యీ సంగతి తెలియ జెప్పటమే !

సుంద:— వధూవరుల్ని దేశమంతా ఊరేగిస్తారా ?

రావు:— నీ తలకాయ ! ఇదేదో పొడిచిపారేసిన పని అని మెచ్చుకునే బడుద్ధాయిలు చాలామంది - యీ వర్ణాంతర వివాహాన్ని పొగుడుతూ, రీముల రీముల తెల్లకాగితాల్ని చెడగొట్టటమే కాకుండా - వీళ్ళ ప్రతిభను లెడ్ స్వీకర్లు అమిర్చిన ప్లాట్‌ఫారాలమీద, ఉపన్యాసాల రూపాన, వాగుతూ, వీళ్ళ మెడలు విరిగేట్టు దండలువేసి ఊరుకునే వాళ్ళు. ఇక వార్తాపత్రికల వాళ్లు ఉచితంగా వీళ్ళ ఫొటోను తమ పత్రికలో వేసి, చెడ రాసి వొదిలేవాళ్ళు—

సుంద:— అబ్బ ! వీళ్ళకు ఎంత కీర్తి వొస్తుంటే ?

రావు:— అదే కళ్లు మూసుకు పోవటంవల్ల - కనిపించక, అపకీర్తిని, పొరపాటున కీర్తిగా కావిలించుకోటం—

సుంద:— ఐనా ఇంత ప్రచారం చేస్తే వాళ్ళ కేం లాభం ?

రావు:— వీళ్ళలాంటి సమస్యల్ని ఎదుర్కొనే ప్రతివాడూ యీ పాడుపనిని సమర్థించటం మొదలు పెడతాడు. అసలు

ముందుగా యీ వధూవరులే యీ ప్రచారాన్ని సాగి స్తారు - ఇంకా కొంత మందిని తమకు తోడుగా తెచ్చు కునేందుకు ! పాపి - తనలాటి పాపుల్ని మరికొంతమందిని చూసి ఊరట చెందినట్టు !

సుంద:— ఇంకేం....ఇది చాటుగా సాగిపోతుందనే ధైర్యం మీకు ఉండనే వుందిగా ?

రావు:— ఇంకా ముందు ముందు ఆలోచించు, ఇప్పటికే జయ నోరు నొక్కలేక ఛస్తున్నాము. రేపటినుంచీ దాని బిడ్డ నోరుకూడా నొక్కాలి. ఆ కలగబోయ్యే బిడ్డ ఏడుపు తలచుకుంటేనే నాతలమీది వెంట్రుకలు లేచి నిల బడుతున్నయ్ ! ఏడవవొద్దని ప్రార్థించినా, కోపగించినా ఆబిడ్డ మనను లెక్కచెయ్యడు. ఎవరైనా యీబిడ్డ ఎవరంటే—?

సుంద:— దొరికిందని చెప్తాం—

రావు:— లోకంలో అందరూ మనంత బుద్ధిహీనులే ఐతే అనుకోవచ్చు. అంత తేలిగ్గా వీళ్ళందరికీ టోపీ వెయ్యటం మాటలా ? కొంత మందన్నా నడుంకట్టి— వెంటపడి, నిజాన్ని బైటికి లాగేదాకా నిద్రపోరు—

సుంద:— జీతమూ, భత్తెమూ లేని యీ చాకిరీవల్ల ఎవరికి మాత్రం ఏం లాభం ?

రావు:— కీర్తి సంపాయించటం రెండు రకాలు. మొదటి రకం— స్వతహాగా ప్రతిభ ఉండటంవల్ల వొస్తుంది. ఇక రెండో రకం చుట్టుపక్కల వాళ్ళను అణగ ద్రొక్కి వాళ్ళను అల్పుల్ని చేసి తాము ఘనులవటం. అంటే

మన మంచితనాన్ని చూపటానికి ఇతరుల చెడ్డతనాన్ని చూపటం లాటిది. ఈ రెండో పద్ధతి చాలా తేలికది; అడ్డదోవ లాటిది. అందుకని చాలామంది యీ పద్ధతే మొదలు పెడతారు.

సుంద:— ఇది కుటుంబ రహస్యం కదా—

రావు:— అందుకనే జాగ్రత్తగా కాపాడాలి. మనందరం పూరు కున్నా జయ 'నా పాపాయి' అనీ, శ్రీధరం 'నా బిడ్డ' అనీ— ఆబిడ్డ ముచ్చటలు తీర్చటం ప్రారంభించి నప్పుడైనా లోకానికి తెలియక పోదు. మన కన్నును మనం పొడుచుకున్నంత ఘోరంగా ఇతరులు ఎవ్వరూ పొడవ లేరు. ఇతరుల ప్రయత్నాలకన్న ముందుగా— ఇంటిలోని వ్యక్తులవల్లనే యీ రహస్యం చప్పున అంటుకుంటుంది. మనను ఎరిగినవాళ్ళూ, మన పతనానికి కాచుకు కూర్చున్న వాళ్లూ దాన్ని వెంటవెంటనే ప్రచారమయ్యేట్టు చూస్తారు.

సుంద:— నెలకో నౌకర్ను మారుస్తూ వంటమనిషిని మాని పించి ఆచాకిరీ అంతా నానెత్తిన వేశారు— అందుకేనా ?

రావు — ఆ సంగతి నీ కిప్పుడా, అర్థమైంది ?

సుంద:— అందుకనే నేను మీకో ఉపాయం చెప్పాను: ఏ కాశీ ప్రయాణమో చెప్పి, ఏ వైజాగ్ ఆస్పత్రికో వెళ్ళి కాన్పు చేసుకొని వాస్తే బాగుండి పొయ్యేది! అప్పుడు యీ ఎరిగినవాళ్ల బాధా, యీ సమాజపు కోరచూపులూ తప్పేవి !

రావు:— అక్కడ ఇంతకన్న ఘోరమైన సమాజం ఉండొచ్చు మనం ఎరగని ఆ సమాజం కన్న, ఎరిగివున్న యీ సమా

జమే నయం! అదీకాక, మనం పుట్టినప్పుడు ఎవర్ని ఎరుగుదుం? కన్న తల్లిదండ్రులు కూడా మనకు తెలియదు. మెల్లిగా 'అమ్మ' అనీ, 'నాన్న' అనీ వేలెట్టి చూపుతూ, క్రమంగా యీ ఎరగటాన్ని మనలో వృద్ధి చేశారు. తరువాత తరువాత - ఎరిగి వుండటంవల్ల - ఎప్పటి కన్నా మనకు సహాయం ఉంటుందనే భ్రమతో - తీరుబడిగా ఉన్నప్పుడల్లా ఇంకా ఎరిగి ఉండటాన్ని అభివృద్ధి చేసుకునేందుకు, పని కట్టుకొని తిరుగుతూ వొచ్చాం. కాని యీ ఎరిగి ఉండటంవల్ల జరిగే మేలుకన్నా హానే ఎక్కువ. చూట్టూ మనను వేయికళ్ళతో కాపాడే వాళ్లుంటే - మన ఆటలు ఎల్లా సాగుతయ్? దూరపు కొండలు నునుపని - మనం అంత దూరమూ పరుగెత్తి నట్టయితే - ఏమయ్యేదీ? అక్కడ కూడా మనుషులంటూ వుంటారు కనుక, క్రమంగా నువ్వూ, జయా వాళ్ళతో పరిచయం చేసుకునేవాళ్లు, అంటే మనను ఎరిగినవాళ్లుఎక్కువయ్యే వాళ్ళు. ఆ పరిచయం స్నేహంగా మారేది. స్నేహం అంటే - రహస్యాల్ని బైటపెట్టుకోవటంగా ఫలించేది—

సుంద:— అక్కడి వాళ్లు మనను ఎరగరుగా - వాళ్ళకు మన రహస్యం తెలుస్తే మాత్రం ప్రమాద మేముందీ?

రావు:— ఆఁ. అదే....కొద్ది రోజుల్లో ఎవరిదాపెన వాళ్లు వెళ్తా మనే ధీమాతో, మనం లెక్క చెయ్యకుండా, అతి సామాన్య విషయాన్ని మాట్లాడినట్టు, యీ విషయాన్ని కూడా వాగేవాళ్లు. వీళ్ళల్లో మనకు తెలియని వాళ్ళూ,

కాని మనం తెలిసివున్న వాళ్ళూ ఉండొచ్చు. వాళ్లన్నా ప్రచారానికి పూనుకోక మానరు. ఈవూరినుంచి ఆ వూరికి పొయ్యేవాళ్ళు — తిరిగి వొస్తూ తమ సామానుల బరువు చాలక—కూలిడబ్బులు ఖర్చు కాకుండానే ఇలాటి తాజావార్తల్ని మొయ్యక మానరు! ఇంకో ఇబ్బంది కూడావుంది. మీరు కనీసం ఆరు నెలల పాటన్నా అక్కడ వుండాలి. అంత కాలం మీరు యీ వూళ్ళోనుంచి మాయమైతే—

సుంద:— మీ ఒక్కరికీ ఉండేందుకు భయమా? హోటల్ తిండి పడదని దిగులా?

రావు:— నాకేం భయం? ఏదోవొక తిండిపోతూంటే— పడక ఏం చేస్తుందీ? అదీకాక వంశగౌరవం పోయి పడే బాధలో.... యీ ఒంటరి అవస్థలోని బాధ ఒక భాగమే అవుతుంది 'మీ వాళ్ళు ఊళ్లో లేరా?' అని అడిగే ఎరిగి వున్న ప్రతివాడికీ కోపగించుకోకుండా ఏదో వొక జవాబు చెప్పాలి. నిజం చెప్పేందుకు వీల్లేదు కదా?

సుంద:— పోనీ అబద్ధమే చెప్పేది!

రావు:— అబద్ధం ఆడటం అంత తేలికా కాదు. అదీ కాక మనం చెప్పింది అబద్ధమనే విషయాన్ని వాళ్ళు గ్రహించ గలిగేటంత స్వల్ప కాలంలో, మనం చావబోవటమూ లేదు! అదీకాక, నిజానికి ఒకేదారి; కాని, అబద్ధానికి ఎన్నిదార్లన్నా ఉన్నయ్. ఒకడితో ఒక కారణం చెప్పి, వాడికి ఏం చెప్పావో గుర్తులేక, ఇంకోడికి ఇంకో కారణాన్ని చెప్పటం సంభవించేది. కాల ఖర్మ వశాత్తూ వాళ్ళి

ద్దరూ కలుసుకొని, మాటల సందర్భంలో నేను చెప్పింది శుద్ధ అబద్ధమని తేల్చుకోక మానరు. వెంటనే తమకు టోపీ వేసినట్టుగా భావించి, ఆ పరాభవాగ్నితో నిజాన్ని వెతకటం ఆరంభిస్తారు. పనిభారాన్ని తగ్గించుకునేందుకు, ఇంకా మరికొంత మందికి యీరహస్యాన్ని వూది— వాళ్ళను కూడా తోడు తెచ్చుకుంటారు. 'నిజం' అనే దానికి మరేమీ ఇతర దొంగదార్లు లేవు కనుక— అటు తిరిగీ ఇటు తిరిగీ వాళ్ళు నిజాన్ని గ్రహించేదాకా తమపట్టు వీడరు! అప్పుడు మన యీ పవిత్రగృహం—

సుంద:– ఇది మన స్వగృహం కాదుగా! మీరు అమ్మేశాక 'స్వగృహే' అల్లా 'వసతిగృహే' ఐంది. మనది కానప్పుడు పవిత్రత చెడితే మాత్రం మనకేం ?

రావు:– నీతలకాయ! గృహంలో ఉండే వాళ్ళను పట్టి గృహ పవిత్రత ఉంటుంది కనుక—

సుంద:– పోనీ ఈ గృహపవిత్రత చెడకుండా – ఇంకో గృహాన్ని—

రావు:– గృహ పవిత్రత ఏనాడో చెడింది; అది చెడినందుకే నేవింత బాధపడటం లేదు. ఆ చెడిన సంగతి అందరికీ తెలుస్తుందేమో నని నాపడుపు! అదీ కాక_జయ యీ ఇంటి గోడల మధ్యనే వుంటే _ దానిసంగతి తెలిసేందుకు, లోకంలో యీ ఒక్క తావే! కాని గడప దాటుతే - అది తిరిగే తావు లన్నింటిలోనూ పట్టుబడే అవకాశం వుంటుంది. ఈ రెండో విధానం - మనం చిక్కేందుకు ఎక్కువ మార్గాల్ని కల్పించటమే అవుతుంది. మన పూర్వ

కులు ఎంత తెలివైనవాళ్ళో తలుచుకుంటే మహదానంద మవుతుంది!

సుం ద:— పూర్వీకుల సంగతి చెప్పటం మొదలు పెడుతే తెల్లారేదాకా అవదేమో?

రావు:— ఒక్కమాటలో చెప్పేస్తాను; వాళ్లు యీ గట్టి ఎత్తైన ప్రహారీ గోడల్ని కట్టారు - ఇలాటి అసందర్భం వొస్తే బైటి ప్రపంచానికి తెలియకుండా వుండేందుకు!

సుంద:— ఔను. ఇంట్లో వాళ్ళు బాధపడి ఏడుస్తున్నా, ఇతర్లకు వినపడకుండా వుండేందుకు! అదేవిధంగా ప్రపంచం మనను అనే మాటలూ, అనాథలు పడే బాధా, బాధను ఓర్చలేని దుఃఖమూ - ఇవన్నీ మనకు వినిపించకుండా వుండేందుకు! ఆ పెద్దలు కట్టిన గోడలు శిథిల మవకుండా, ప్రతి సంవత్సరమూ జాగ్రత్తగా బాగుచేయిస్తూ, పూర్వీకుల కన్న తెలివిగా ఆలోచించి, ఈ పరదాల్నీ, తెరల్నీ, ఘోషానూ మీారు దింపారు - ఔనా?

[నౌకరు కుర్రాడు వొచ్చాడు]

సుంద:— ఏం?

రావు:— జయమ్మగారు మిమ్మల్ని పిల్చుకు రమ్మన్నారు.

సుంద:— వొస్తున్నాలే....పొ

[కుర్రాడు వెళ్ళిపొయ్యాడు]

రావు:— వీణ్ని అక్కడి కెందుకు రానిచ్చావ్?

సుంద:— వాడు తెలుసుకు పోతాడేమో నని మీాభయం? ఐనా నిన్నకాక మొన్న పనిలోకి వొచ్చిన, అంత చిన్న వెధవకు ఏం అర్థమాతుందీ? మనంత విషపు టాలోచన

లకు వాడింకా అలవాటు పడలేదులెండి! ఆ గొడ్లపాకలో జయ ఒక్కతే ఎలా వుంటుంది? భోంచేసి వొస్తానని వొచ్చాను. ఇంతవరకూ మీతో కాలక్షేపమే సరిపోయింది.

రావు:— ఇందాకటినుంచీ సీతో ఏదో మాట్లాడుతున్నానన్న మాటే కాని - జయ బాధతో అరుస్తూన్నట్టూ, అంతా నాకు వినబడుతూన్నట్టూ తోస్తూనే వుంది—

సుంద:— పాపిష్టి అంతరాత్మ పడే బాధ!

రావు:— (కోపంతో) అంతరాత్మకు యీ పాపాన్నీ, భయాన్నీ కల్పించిన పరిస్థితుల్ని నిర్మూలిస్తే - కూకటివేళ్ళతో సహా వొదిలించుకుంటే - ఇక దాని ఘోషా వుండదు; అందుకు నేను భయపడే అవకాశమూ ఉండదు - (అగ్గిపెట్టె తీసి) ఎప్పటికైనా యీ ఉత్తరాలు ఎవరి కళ్ళనన్నా పడితే - ఇట్టే దొరికిపోతాం——

సుంద:— ఒద్దు....ఆ ఉత్తరాల్ని తగలపెట్టకండి. జయకు అవ్వంటే ఎంతో ఇష్టం. జయ వాటిని రోజూ వొకసారన్నా చదువుకొని ఆనందిస్తూంటుంది—

[రావుబహద్దూర్ ఉత్తరాలకు నిప్పంటించాడు. సుందరమ్మ అడ్డంపోయింది. కాని, ఆమెను బలవంతంగా అవతలికి తోసిపారేశాడు. మంట పెద్దదై పోయింది. ఆ వెలుగులో రావుబహద్దూర్ గారి ముఖం వికృతాకారాన్ని దాల్చింది.]

సుంద:— ప్రాణంలేని ఉత్తరాలు కూడా మీకు హాని చేసినయ్యా?

రావు:— వాటికి ప్రాణం లేకపోతే మాత్రమేం? ప్రాణా

లున్నవాళ్ళు వాటిచుట్టూ తిరుగుతూన్నప్పుడు - ఏక్షణా న్నయినా వాటికూడా ప్రాణం రావొచ్చు. వాటికి ప్రాణం వొచ్చిన సంగతి మనకు తెలియక పోవటంవల్ల, ఎంతో అజాగ్రతతో ఉంటాం. అప్పుడు ఇవ్వి చెయ్య గలిగే హాని—ప్రాణం వున్నవాళ్ళెవ్వరూ చెయ్యలేరు! నోటిమాటలా గాలిలో కలిసి కరిగిపోవ్వేందుకు?

సుంద:— (కాలిన మసివైపు సానుభూతిగా చూస్తూ) జయ ఆనందాన్ని బూడిద చేశారు—

[సుందరమ్మ వెళ్ళిపోయింది. రావు బహద్దూర్ పక్కనే వున్న అల్మారాలోంచి బ్రాందీబుడ్డీ గ్లాసూ తీసి— డోసుమీద డోసు వెయ్యటం ప్రారంభించాడు. ఆనందంతో తేపి, గొంతులోంచి ఎగుమతైన సరుకంతా పొట్టలో సక్రమంగా సర్దుకునేందుకు కాస్త ఆగాడు. సుందరమ్మ వొచ్చింది.]

సుంద:— ఈరాత్రి మళ్ళీ యీ కొలుపు పెట్టారూ?

రావు:— భరించలేని కఠిన సత్యాన్నుంచి దూసుకు పోవ్వేందుకు కనిపెట్టబడ్డ ద్రావకం! ఐనా ఇప్పుడేమైంది?

సుంద:— జయకు నొప్పులు బాగా ఎక్కువయినయ్. పోయి డాక్టర్నన్నా, మంత్రసానన్నా పిలుచుకొని రండి....

రావు:— మనసంగతి ఊరంతా తెలియలేదని సిదిగులు!

సుంద:— నే నొక్కతెనూ పట్టుకోలేక పోతున్నాను. అది వేసే కేకలకు—ఇంకో మనిషి సహాయం కూడా చాలా అవసరం!

రావు:— నయమే! అది బాధతో అరవటం ప్రారంభిస్తే పేటలోని జనమంతా మన ఇంటిముందే గుమికూడు

తారని ముందుగా ఆలోచించే— గొడ్ల పాకాలో పురిటి గదిని అమిర్చాను. ఆ దొడ్డికి అవతలంతా పెద్ద మైదానం కనుక బతికి పొయ్యాం. తుపాను గాలికూడా మన మంచికే వొచ్చింది—

సుంద:— బైటికివెళ్ళి ఏ డాక్టర్నన్నా పిలుచుకొని వొచ్చే శ్రమను మీకు తప్పించింది.

రావు:— అదికాదు. ఈ గాలిచేసే గోలలో — జయవేసే కేకలు ఎవరికీ వినపడవు!

సుంద:— సరేలెండి. ఇక్కడ నేను కబుర్లుచెప్తూ కూర్చుంటే అవదు. మీరు వెంటనే వెళ్ళి డాక్టర్ను తీసుకురండి.

రావు:— డాక్టర్ కు ఏమని చెప్పేట్టూ ?

సుంద:— ఈ పరిస్థితుల్లో అనుమానించి పిల్లప్రాణం తీస్తామా? తరువాత ఏమన్నా కానిండి —

రావు:— నిజంగా ఇది ప్రాణాలు తీసేందుకే ఇంత దూరమూ వొచ్చింది.

సుంద:— అబ్బ ! బయలు దేరండి. కనేప్పటి అవస్థా, బాధా మొగాళ్ళకు మీకేం తెలుస్తుందీ ? నా కొన్నప్పుడు కూడా నేనింత బాధపడలేదు. అదుగో ఏడుస్తోంది. నేను వెళ్తున్నాను. మీరు ఇంకేమీ ఆలస్యం చెయ్యకుండా బయలు దేరండి.

[సుందరమ్మ వెళ్ళిపోయింది. రావు బహద్దూర్ గారు ఏం చేసేందుకూ తోచక పచార్లు చేస్తున్నాడు. ఒక్క క్షణం గడిచింది. నాగడు వొచ్చాడు. చాలామంది దుర్మార్గుల ముఖాల్లో ఆదుర్దాన్ని చూడలేం. కాని నాగడి రకం మనుషుల్లో— ఆ చూపు

ల్లో నే దుర్మార్గాన్ని చూడగలం; అంటే దుర్మార్గాన్ని దాయ
గలిగే శక్తి నాగడిలో లేదు. ఎర్రబడ్డ కళ్ళు ఎలాటి ఘోరమైన
పనినన్నా ఇట్టే చేసెయ్యగలమన్నట్టున్నయ్.]

రావు:— (కూర్చొని, ముఖ భంగిమాన్ని మార్చుకునేందుకు ప్రయత్నిస్తూ) రా— నాగడూ! (నాలిక కొరుక్కొని పెద్దగా) నాగయ్యా!

[నాగడు క్రింద కూర్చున్నాడు. రావు బహద్దూర్ గారు గ్లాసులో
బ్రాందీపోసి అందిచ్చాడు. నాగడు దాన్ని తీసుకునేందుకు
అనుమానిస్తూ, ఊరుకున్నాడు.]

రావు:— మరేం ఫర్వాలేదు. సారా దగ్గరా, సాని దగ్గరా — రాజుకూ ఫకీరుకూ భేదంలేదు. తీసుకో—

[నాగడు గ్లాసు ఖాళీచేశాడు]

రావు:— పని పూర్తయిందా?

నాగ:— కట్టెలు—స్మశానానికి జేరేశాను....ఇదంతా ఎందుకో చెప్పారు కాదు—

రావు:— అమ్మాయి పోయింది....దహన సంస్కారాలకు....

నాగ:— జయమ్మగారా? పాపం! ఏం జబ్బు బాబుగారూ? జబ్బుగా ఉన్నట్టు కూడా అనుకోలేదే? ఐనా ఇంటికళ చూసి చావు సందర్భం అనుకోలేదు—

రావు:— ఏడ్చేందుకూడా వీల్లేకుండా, మా నోళ్లు నొక్కేసింది నాగయ్యా! అదంతా తర్వాత చెప్తాను—

[రావుబహద్దూర్ గారు ఇంకో గ్లాసు బ్రాందీ అందిచ్చాడు.
నాగడు అది కూడా తాగేశాడు]

రావు:— ఇంకొక్క పని వుంది—

నాగ:— సెప్పండి—

రావు:— ఈ రాత్రే దహనం పూర్తయిపోవాలి—

నాగ:— ఈ చీకట్లోనూ, గాలిలోనూనా ? అర్థరాత్రి—

రావు:— అర్థరాత్రి కనుక ఈ గాలికి ఎవరూ చూడరు; క్షణాల్లో మంట రగులుకుంటుంది. అంతా పది పదిహేను నిమిషాల్లో పూర్తవుతుంది.... నీ బండీలోనే శవాన్ని కూడా జేర్చేసి - ఇది దగ్గర వుంచు—

[రావుబహద్దూర్ గారు వంద రూపాయిల నోటును అందిచ్చాడు. నాగడు తీసుకుంటూ—]

నాగ:— పోనీ రేప్పొద్దున—

రావు:— సహాయమంటే ఇదేనా ? నీ మేలు మరిచిపోతాననుకోవాక—

నాగ:— మీరు కూడా వెంట వుండండి.........నా వొక్కడికే భయం !

రావు:— వెంట వుండే సందర్భంకాదు ! ఐనా నీలాంటి బలవంతుడు చచ్చినవాళ్ళను చూసి భయపడతాడంటే నవ్వొస్తోంది - స్మశానం అంటే మైళ్ళదూరం లేదుగా - అంతా మూడు ఫర్లాంగులేనాయె!

నాగ:— ప్రభువుల దయ ఉండగా నాకేం భయం ?

రావు:— సరే....దొడ్డిగుమ్మం దగ్గరకు బండితో సిద్ధంగా వుండు - నేను వొచ్చేదాకా అక్కడే వుండు; ఆలస్యమైనా సరే—

[నాగడు తలవూపి వెళ్ళిపొయ్యాడు. రావు హద్దూర్ తను చేసిన పనీ, మాట్లాడిన మాటలూ సరిగ్గా ఉన్నయ్యా అని ఆలోచిస్తున్నాడు. క్షణం గడిచింది. సుందరమ్మ వొచ్చింది]

సుంద:— ఏమండీ! జయ చుట్టలు తిరుగుతోంది - మీారింకా ఇక్కడే వున్నారా?

రావు:— వెళ్ళి వొచ్చాను. డాక్టర్‌కు తేలు కుట్టటంవల్ల — రాలేక పోయ్యాడు—

సుంద:— మీారు అప్పుడే డాక్టర్ దగ్గరకు వెళ్ళివొచ్చారా?

రావు:— నాలుగైను ఇళ్ళవతలేగా డాక్టర్?

సుంద:— ఆ కొత్త డాక్టరా?

రావు:— ఏం కొత్తయితే? ఊళ్ళోది కాకా ఎక్కడపోయి వొచ్చేదీ?....ఇదుగో మందు ఇచ్చాడు. నీళ్ళల్లోనన్నా పాలలోనన్నా కలిపి తాగిస్తే సుఖంగా ప్రసవిస్తుందని చెప్పాడు.

[జేబులోంచి మందు పొట్లాం తీసి సుందరమ్మ చేతికి ఇవ్వబోయ్యాడు. చేతులు ఒణకటంవల్ల, పొట్లాం కింది పడ్డది. దాన్ని ఏరేందుకు రావుబహుద్దూర్ వొంగేలోపలే - సుందరమ్మ ఏరింది]

రావు:— మందు త్వరగా వేసుకుంటే - ఇంక ఏ బాధా వుండదు.

[సుందరమ్మ తలవూపి వెళ్ళిపోయింది. రావుబహద్దూర్ భయాన్ని భరించలేక, మళ్ళీ తాగుతున్నాడు. ఒక్క నిమిషం గడిచింది, నౌకరు కుర్రాడు పరుగెత్తుకుంటూ వొచ్చాడు—]

కుర్రా:— మిమ్మల్నొకసారి పిలుచుకు రమ్మన్నారు—

రావు:— నీకు నిద్ర రావటం లేదట్రా?

కుర్రా:— జయమ్మగారు ఏడుస్తూంటే నిద్దరెలా పడుతుందీ?

రావు:— పోనీ ఇంటికిపోయి పడుకోరాదూ?

కుర్రా:— ఈచీకట్లో, గాలిలో నేను పోలేను - నాకు భయం!

రావు:— మా మేడల్లో వేళ్ళాడటమే నీకు వాటంగా వుంది—
కుర్రా:— మిమ్మల్ని త్వరగా రమ్మని చెప్పుతున్నారు.
రావు:— (విసుగ్గా) వొస్తాన్లే - ఫోవోయ్—

[కుర్రాడు వెళ్ళిపొయ్యాడు. రావుబహద్దూర్ - విషాదాలోచనలో పడ్డాడు. వెళ్ళేందుకని లేచి - కొంచెం దూరం వెళ్ళి, అనుమానించి, మళ్ళీ వొచ్చి కూర్చున్నాడు - క్షణం గడిచింది. సుందరమ్మ వొచ్చింది]

సుంద:— ఏమండీ! రమ్మంటే రాలేదు—?
రావు:— నేను వొచ్చి చేసేదేముందీ?
సుంద:— ఇంతకు ముందే జయ ప్రసవించింది - మగబిడ్డను!

[తనకు ఆదేమీ పట్టనట్టు వూరుకున్నాడు]

సుంద:— కాని ఆ కుర్రాడు చచ్చిపొయ్యాడు—
రావు:— అమ్మయ్య! ఈ కష్టసమయంలో ఒక బెడద వొదిలినా వొదలినట్టే!
సుంద:— కని, పెంచే జయకు లేని కష్టం, మీకేం వొచ్చిందీ? కుర్రాడు ఎంత అందంగా వున్నాడనీ! వాణ్ని చూస్తే మీరు అంతమాట అనరు!

[సుందరమ్మ వెళ్లిపోయింది. ఆలోచనలు తనను ఇంకా బాధిస్తూన్నందుకు రావుబహద్దూర్ ఇంకో గ్లాసు బ్రాందీ తాగేశాడు. క్షణం గడిచింది - సుందరమ్మ గాభరాగా వొచ్చింది]

సుంద:— జయ గుడ్లు తేలేస్తోంది. పచ్చని దాని శరీరం నల్లబడి పోతోంది అది మాట్లాడే స్థితిలో కూడా లేదు. గుండెల్లో పెద్ద బరువేదో ప్రవేశించినట్టు - గుండెల్ని పట్టుకొని, అటూ ఇటూ అదేపనిగా పొర్లుతోంది....నాకు భయంగా వుంది....మీరు కూడా రండి.

రావు:— నే నెందుకూ ?
సుంద:— పోనీ పరుగెత్తుకు వెళ్ళి డాక్టర్‌ను పిలుచుకురండి.
రావు:— ఆ స్థితిలో డాక్టర్ కూడా ఏం చెయ్యలేడు—
సుంద:— అదేంటండీ అలా అంటారు ? మీకు హృదయం లేదు.

[సుందరమ్మ వెళ్ళిపోయింది. సుందరమ్మ అన్న మాటల్ని నెమరు వేసుకుంటూ, తనకు హృదయం నిజంగా నే లేదేమోనని, చెయ్యి వేసి చూసుకున్నాడు. గుండెలు కొట్టుకొంటూన్నట్టూ, వాటి వేగమూ, ధ్వనీ తను బాగా వినగలుగుతూన్నట్టూ గ్రహించి తృప్తిపడ్డాడు - సుందరమ్మ వొచ్చింది]

సుంద:— జయ చనిపోయింది—

[విచారకరంగా తల వొంచుకు కూర్చున్నాడు]

సుంద:— మీరు తెచ్చిన మందు విషమించి వుంటుంది—
రావు:— (తన రహస్యాన్ని గ్రహించిందని పొరబడి) అది— విషమే !
సుంద:— ఏమిటీ—విషం ఇచ్చారా ? అది నా చేతిమీదు గానే జయకు పెట్టించారా ? ఇంత దుర్మార్గమా ?

[తన పొరపాటును గ్రహించి, మించిపోవటంవల్ల మాట్లాడకుండా వూరుకున్నాడు.]

సుంద:— మీ పవిత్రత కోసం కన్న కూతుర్ని బలిపెట్టు కున్నారు !
రావు:— ఇది నా వొక్కడి సౌఖ్యంకోసమూ చేసినపని కాదు. ఇందులో అందరి పరువుమర్యాదలూ ఇమిడి వున్నయ్. ఒక్కటి ఆలోచించు: ఈ నిందను రేపు నీ కన్నకొడుకు రాజాయే భరించాల్సి వుంటుంది—
సుంద:— కాకుల్నికొట్టి గద్దలకు వేసినట్టుంది. ఇదేనా మీరు

చెప్పే ఓదార్పు ?

రావు:— ఐన దానికి గోలపడితే లాభంలేదు. ఇంకా మిగతా పనులు కూడా పూర్తయి పోతే—

సుంద:— ఔను. ఇంకా నేను మిగిలి వున్నాను. ఇంకో మోతాదు మందువుంటే ఇటివ్వండి. నేను మాత్రం మీ పనులకు అడ్డం ఎందుకుండాలీ ?

రావు:— నీమాట కాదు .... ఆ శవాన్ని ఇంట్లో పెట్టుకొని కూర్చుంటే, ఎంత ప్రమాదమో ఆలోచించు....

సుంద:—ఏమిటీ—జయ శవంకూడా మిమ్మల్ని భయపెడుతూనే వుందా ?—మీరు.... ....

[రావు బహద్దూర్ ఆమె మాటల్ని వినిపించుకోకుండా వెళ్లి పోయ్యాడు. ఆమెకు పరిస్థితులన్నీ వెంటనే అర్థమవక సింహావలోకనం చేసుకోసాగింది. క్రమంగా విచారం ఆమెను పూర్తిగా ఆవరించింది. ఒక నిమిషం గడిచింది. రావు బహద్దూర్ తిరిగి వొచ్చాడు.]

రావు:— ఏమిటే—ఏడుస్తున్నట్టున్నావే ? నీకో నమస్కారం ఏడ్చి గోలచేసుకుంటే—ఊరంతా ఇప్పుడే ఇక్కడికి పరుగెత్తుకొని వొస్తుంది—

సుంద:— ఏడవక నవ్వే సందర్భమా ఇది ? రేపు నాకు ఇంతకన్న ఎక్కువ సత్కారం యీ ఇంట్లో జరుగుతుందా ? అంతరాత్మ వున్న మానవుడు—

రావు:— సరే....తప్పు జరిగిపోయింది కనుక నువ్వు అనటమూ, నేను పడటమూ ధర్మమే ! కాని ఇతర్లు వినటమూ, దానివల్ల వృద్ధిలోకి రావాల్సిన వాళ్ళ జీవితాలు పాడవటమూ - అదంతా ఆలోచించు....

సుంద:— నోరు నొక్కుకోమని ఆజ్ఞా? ఎంత ఖర్మం వొచ్చిందీ! ఆ నరకమే మేలు. అక్కడ బాధతో నన్నా ఏడవ నిస్తారు!

రావు:—నీ సానుభూతి కన్నీటిని చూసేందుకన్నా జయప్రాణం మళ్లీ తిరిగిరాదు. కనుకొలకుల్లోనే కన్నీటిని దిగమింగు కోవాలి; నాకు మాత్రం బాధా, విచారమూ లేదా?

సుంద:— తేలు దొంగకు కుట్టినా బాధ వుంటుంది....కాని అసలు దొంగతనం ఎందుకు చెయ్యాల్సి వొచ్చిందీ అని_

రావు:— ఇంక నీ విమర్శల్ని ఆపు. నీ ఏడ్పు వినేందుకు - కనీసం జయ శవమన్నా ఇక్కడ లేదు....

సుంద:— ఏమిటీ? దాని శీతల శరీరాన్ని కూడా పంపేశారా? బతికివున్న జయకన్న మృతి పొందిన జయే మీకు భారమైందా?....రాజా యీ రాత్రి వొస్తాడని మీకు తెలుసు అసలు యీ పాటికే రావాల్సింది. వాడికి దాని శవాన్ని చూసే అవకాశమన్నా లేకుండా....

రావు:— మరేం ఫర్వాలేదు. రాజా చూసి మాత్రం ఏం చేస్తాడూ?. నువ్వేమీ గోలచెయ్యవోక. ఇదంతా తెలుస్తే వాడి లేత హృదయం గాయపడు తుంది. అంతా నేను సమర్థిస్తాను—

సుంద:— మీరు అందరి హృదయాలూ గాయ పరుద్దామనే బయలు దేరారు. మీ కోర్కె- నెరవేరు తుంది....ఛీ....

[అసహ్యంతో మాటలు రాక వూరుకుంది]

రావు:— ఆ గాభరాలో నా కేమీ తోచలేదు. ఏదో వొకటి చేసి తప్పించు కోవాలని——

సుంద:— (మాటకు అడ్డు వచ్చి) నిర్దోషిని చంపారు! దోషైన మీకు, ఆ శిక్షను అనుభవించేందుకు ధైర్యం లేక, దాన్ని నిర్దోషి మీద తోశారు. జయది నేరం లేని శిక్ష! మీది శిక్షలేక నేరం! మీ తప్పును దేవుడు కూడా క్షమించ లేడు!

రావు:— దేవుడిదాకా ఎందుకూ? ముందు నువ్వు క్షమిస్తే నా లక్ష్య తప్పొల్ని కాచినట్లు! ఎవరైనా వొస్తే పరిస్థితిని గ్రహించే అవకాశం ఇవ్వకుండా, కాస్త ఆముఖ భంగిమను మార్చద్దూ - నీకు పుణ్యం వుంటుంది—

[రాజారావు వొచ్చాడు]

రావు:— (గొంతును కావాలని ఒణికిస్తూ) ఇప్పుడే వొచ్చిందా బండి?

రాజా:— అక్కయ్య ఏదీ?

సుంద:— ఇంకేం అక్కయ్యరా - చనిపోయింది—

రాజా:— ఆఁ. (కూలబడి) చనిపోయిందా? ఎందుకనీ?

రావు:— లోకంలో కారణం చెప్పలేనిది ఒక్క మృత్యువే!

రాజా:— ఎప్పుడు పోయిందీ?

సుంద:— ఇంతకు ముందే—

రాజా:— డాక్టర్ రాలేదా?

రావు:— ప్రాణమే పోయ్యాక డాక్టర్ దేనికి?

రాజా:— (వినిపించుకోకుండా) డాక్టర్!....జయ చచ్చిపోయి వుండదు..........నన్ను చూడందే అది చావలేదు. నేను పోయి డాక్టర్‌ను పిలుచుకొని వొస్తాను—

[రాజా గబగబా వెళ్తున్నాడు]

రావు:— రాజా! వెళ్ళవోక.... నా మాట విను.... రాజా!.... వానకూడా వొచ్చేట్టుంది.... రాజా!

సుంద:— వాడు వెళ్ళిపొయ్యాడు!

రావు:— వీడికి ఇంత తొందరేం?

సుంద:— మీ హృదయం పని చెయ్యటం లేదు. అందుకని అందరి హృదయాలూ పని చెయ్యటం లేదని మీరు అనుకుంటున్నారు.

రావు:— నీ బుర్రలో మెదడు కరిగిపోయినట్టుంది!

సుంద:— ఔను. నాకు తెలివితేటలు వుంటే ఇంత దుర్మార్గం జరిగేదే కాదేమో? రాజాను చూడండి: ఒక్క కడుపున పుట్టకపోయినా, జయ అంటే వాడికి ఎంత మక్కువో ఎంత అభిమానమో—ఒక్క కంచాన తింటూ, ఆటల్లో, పాటల్లో చిన్నతనమంతా గడిపిన వాళ్ళ స్నేహాన్ని తుంపేశారు. ఇప్పుడు వాడికి ఏం జవాబు చెప్తారూ?

[బైట ఉరిమిన శబ్దం. నౌకరు కుర్రాడు వొచ్చాడు.]

రావు:— ఏరా? పడుకోక ఇట్లా వొచ్చావేరా?

కుర్రా:— ఈ గాలికి నాకు భయంగా వుందండీ! ఒక్కణ్ణీ—

రావు:— మరేం ప్రాణం పోదులే! పోయి ఒకమూల పడి వుండు.

సుంద:— మా భయంతోనే మేము ఛస్తూంటే—నీ భయం కూడా అంటగడతావేరా?

రావు:— (కోపంతో) ఫో వేరా—

[నౌకరు కుర్రాడు భయపడి వెళ్ళి పొయ్యాడు. సుందరమ్మకు వొచ్చిన, చేతకాని కోపం, ఏడుపుగా మారేందుకు సిద్ధంగావుంది. బైట కారు ఆగిన ధ్వని]

రావు:— కారు ఏదో మన ఇంటిముందే ఆగింది.... ఏడవ్వోక.... ఎవరో వొస్తూన్నట్టుంది.... పోలీసులు కారు కదా?

సుంద:— శ్రీధరం వొస్తున్నాడు....!

రావు:— (భయంతో) శ్రీధరమా ?

[శ్రీధరం వొచ్చాడు. ప్రయాణపు బడలికతో అలసివున్నాడు. రావుబహద్దూర్‌కు నమస్కరించాడు]

రావు:— (విచారాన్ని కంఠంలోకి లాక్కుంటూ) ఏం నాయనా వొస్తూన్నట్టు ఉత్తరమన్నా రాయలేదేం ?

శ్రీధ:— వొద్దామనుకోలేదు. రాత్రి పీడకల వొచ్చింది. పను లన్నీ వొదిలి వెంటనే బయలుదేరి వొచ్చాను. జయ ఎక్కడా ?

[సుందరమ్మ ఏడవబోతోంది. రావుబహద్దూర్ ఆమె ఏడ్పు వినిపించకుండా, పెద్ద స్థాయిలో మాట్లాడుతూ, సుందరమ్మ వైపు గుడ్లు ఉరుముతున్నాడు]

రావు:— జయ ! ఇంకేం జయ నాయనా ?

శ్రీధ:— ఏం....జయకు ఏమైంది ?

సుంద:— జయ....యీ లోకాన్నే వొదిలేసింది——

శ్రీధ:— ఆఁ. (కూలబడి) ఎప్పుడూ ?

సుంద:— ఇంతకు ముందే !

రావు:— కన లేక, కనలేక ప్రాణాన్ని వొదిలింది——

శ్రీధ:— (చేతులమధ్య తలను ఇరికించుకుంటూ) చనిపోయిందా?

జయ కనలేక చనిపోయిందా? ఇదంతా నేను చేసిన పాపం! నా పాపఫలాన్ని ఆమె అనుభవించిందా?

[క్షణం నిశ్శబ్దం]

శ్రీధ:— జయను చూద్దాం—

రావు:— జయ ఇంకెక్కడ వుందీ? ఈపాటికి ఆమె శవం కూడా తగలపడిపోతూ వుంటుంది—

శ్రీధ:— ఈ అర్ధరాత్రి శవాన్ని దహనానికి పంపారా? ఆమె శవాన్నికూడా మీరు భరించలేక పోయ్యారా?

[బైట ఉరిమిన శబ్దం]

వానకూడా వొచ్చేట్టుగా వుంది. ఆమె శవం తగలపడదు. వాన వొచ్చి ఆరిపోతుంది.... వెంటనే కారులో వెళ్ళి, స్మశానంలోనన్నా ఆమెను చూస్తాను....

[శ్రీధరం పరుగెత్తుకుంటూ వెళ్లిపొయ్యాడు]

రావు:— వీళ్ళందరికీ మందు లేని ఒకే రకం జబ్బు ఆరంభమైంది. వీడికి యీ ప్రేమతో పిచ్చి ఎక్కి - యీ సంగతి ఊరంతా మోగించడు కదా?

సుంద:— మీరు చేసిన పనికిగల శక్తి మీకు అర్ధం కాలేదు. ఆపనికి బతికి వున్న వ్యక్తుల్లోని జీవశక్తు లన్నింటినీ నాశనం చేసే శక్తి వుంది. జీవశక్తే లేనప్పుడు పిచ్చెం ఎక్కుతుందీ?

[రాజా తిరిగి వొచ్చాడు. వాన ఆరంభ మవటంవల్ల కొద్దిగా తడిశాడు.]

రావు:— డాక్టర్ వొస్తున్నాడా?

రాజా:— లేదు. ఈ అర్ధరాత్రి రాలేనన్నాడు. నాకు కోపం వొచ్చి వాణ్ని తన్ని వొచ్చాను.

అమ్మా! జయ ఎక్కడ వుందీ?

[సుందరమ్మ జవాబు చెప్పకుండా ఏడుస్తోంది]

రాజా:— (కళ్లను నీళ్లతో నింపుకొని, తల్లి చేతుల్ని ఊపుతూ) అమ్మా! నిజం చెప్పు - జయ.... ఏదీ?

సుంద:— జయశవాన్ని కూడా చూడలేవు నాయనా! అంతా నిమిషంలో ఐపోయింది—

రాజా:— (కోపంతో) ఇదేం చావు కొంపగా లేదు. ఇందులో కుట్ర ఏదో వుంది. నేను వొస్తున్నానని తెలిసి కూడా శవాన్ని ఎలా మాయం చేశారో, నాకు అర్థం కాకుండా వుంది.

సుంద:— అరిచి గోలచేసి లాభం లేదు. చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే ఏం ప్రయోజనం?

రాజా.— అసలు చేతులెందుకు కాలాయని అడుగుతున్నాను- (కోపంతో) అమ్మా! ఇందులో నీక్కూడా భాగం వుంది,....

సుంద:— (ఏడుస్తూ) నాకు తెలియదు నాయనా! విషం అని నాకు తెలిసివుంటే మాత్రం దానికి ఇచ్చే దాన్ని కాదు—

రావు:— (కోపంతో) నీకు మతి పోతోందా?

రాజా:— విషమా? విషం పెట్టారా? పెట్టగలిగారా? ఛీ! జయను నీచేతుల మీద పెంచావే! అమ్మా! చిన్నతనంలో జయకు స్వయంగా అన్నం కలిపి పెట్టేదానివే.... ఆ చేతుల్తోనే దానికి విషాన్ని పెట్టగలిగావా?

సుంద:— ఇది నా తప్పు కాదు రాజా!

రాజా:— ఈ విశాల విశ్వంలో అక్కయ్య బతికేందుకు చోట

డంత మేర దొరక్క పోయిందా? అది ఎవరికి భార మైందీ? మీ లాటి పాపులకు భూలోకంలో శిక్ష వుందా?

రావు:— ఇదంతా నీ కోసం.... నీ పరువు మర్యాదలు—

రాజా:— నా కోసమా? నా కోసం యీ వెధవ పనిని నేను చెయ్యమన్నానా? పోనీ నాతో చెప్పి చేశారా? ఇవ్వాళ నాకోసం జయ ప్రాణాన్ని బలిపెట్టిన మీరు— రేపు మీకోసం నా ప్రాణాన్ని మాత్రం బలిపెట్టేందుకు అనుమానిస్తారా? ఛీ—

[శ్రీధరం వొచ్చాడు, బాగా తడిసి పొయ్యాడు, కంటివెంట నీరు కారుతోంది. బైట గాలివాన పెద్దదైంది.]

రాజా:— శ్రీధర్! నువ్వెప్పుడొచ్చావ్?

శ్రీధ:— ఆమె శవంకూడా పొగరూపాన ఆకాశంలోకి వెళ్లి పోయింది. చివరకు ఆశవం తాలూకు బూడిదకూడా నాకు దొరకలేదు. వాన నీళ్లల్లో అదంతా కొట్టుకు పోయింది. చివరకు ప్రేమ అంటే లోకంలో ఇంతేనా?

రాజా:— శ్రీధర్! జయకు విషంపెట్టి చంపారు—

రావు:— (కోపంతో ఉరుముతూ) రాజా!

శ్రీధ:— విషమా? తల్లికీ, బిడ్డకూ కూడా విషం పెట్టారా? మీకు చేతులెల్లా వొచ్చినయ్? ఇలాంటి దేదో జరిగి వుంటుందని ఇందాకటి నుంచీ నా అంతరాత్మ ఘోషిస్తూనే వుంది. మనం వొచ్చేప్పటకి ఏమీ — చివరకు బూడిదకూడా లేకుండా ఊడ్చి పారేశారు. ఇంతకన్న దారుణం వుంటుందా?

రావు:— మీరు చిన్నవాళ్ళు. నాకు జయ అంటే ప్రేమ లేదా !

శ్రీధ:— ఉన్నది.... జాగర్తగా, గారాబంగా మేకను పెంచేది కోసుకుతినేందుకేగా? మీకన్న పామూ, పులి వేయి రెట్లునయం. అవ్వి కనగానే వాటి సంతానాన్ని తినేస్తయ్. మనసుల్లో అనురాగాన్ని వృద్ధిచేసి—మీలాగు పెంచి తినవు—

రావు:— నేనేటో తాగివున్నాను. ఆ నిషాలో—అంతా....

రాజా:— ఔను. మైకంలో ఉండబట్టి ఒక్క జయనే చంపారు. లేకుంటే—ఈవూరు మొత్తాన్ని ఖాళీచేసి వుండేవారు—

రావు:— పరువు మర్యాదలు ఏమై పోతయ్యో—

శ్రీధ:— ఆనాడు బాంకులో డబ్బు కట్టకపోతే ఏమయ్యేవీ? ఎంగిలికూడు తినే కుక్కనన్నా నమ్మవొచ్చు! ఆనాటి జయ— యీనాడు మీకు పనికిరాలేదు. కనీసం పనికి వొచ్చే వాళ్ళకన్నా మీరు ఆమెను ఇవ్వలేకు. ఇక మీ పరువు మర్యాదల సౌధాన్ని—ఆమె శవంమీద తప్ప ఇంకెక్కడా కట్టుకోలేరా ?

రాజా:— (కోపంతో) పోలీసుల్ని పిలుచుకొచ్చి వీళ్ళను పట్టిద్దాం—

శ్రీధ:— వాళ్ళు చెయ్యగలిగిం దేముంది? ఉరి వేస్తారు అంతేగా ?

రాజా:— ఆపని మనమే చేద్దామా ?

శ్రీధ:— వద్దు. ఆశిక్ష వీళ్ళకు చాలదు. ప్రాణాలు తియ్యటం ఒక శిక్షకూడా కాదు. ఆబాధ క్షణికం.... అంతకన్న

పెద్ద శిక్షనే—

రాజా:— ఏమిటదీ ?

శ్రీధ:— లేవా—వీళ్ళకు అంతరాత్మలు ? ఆ అంతరాత్మల ఘోషను జీవితమంతా వింటూ బాధపడనిద్దాం—

రాజా:— అంతే! ఈ పవిత్రగృహం ఇక నాకూడా నివాస యోగ్యం కాదు. ఈ పవిత్ర సౌధాన్ని మోసేందుకు ఏనాటికైనా నాశవం కూడా అవసరం కావొచ్చు. ఈ క్షణాన్నే నేను కూడా బైటికి వొచ్చేస్తాను—

సుంద:— నన్ను విడిచి వెళ్తావా నాయనా ?

రాజా:— నువ్వుకూడా నాతో వొచ్చెయ్యమ్మా !

సుంద — నీతో ఎలా వొచ్చేదీ! హిందూ స్త్రీకి పతి తప్ప ఇంకో దైవాన్ని లేకుండా చేశారు. ఒక వేళ తాచుపామే ఆమె భర్తయినా—ఆ పడగకింది నీడలోనే ఆమె బతకాలని శాశించారు. అంతకన్న మరి గత్యంతరం లేదు—

రాజా:— ఔను. ఇంటిలోపలి యీ పవిత్రతను భరించలేక వెళ్ళిపోతున్నాను—

సుంద:— బైట గాలివాన నాయనా! నక్షత్రాలన్నా కనిపించటంలేదు. అర్ధరాత్రి యీ కటిక చీకటిలో, గాలివానలో—

రాజా:— అది పవిత్రులు సృష్టించగలిగే గాలివానకన్న క్రూరతరం కాదు. (శ్రీధరంతో) పవిత్రులు పీల్చి వొదిలే గాలిని ఇప్పటికే మనం అపవిత్రం చేశాం. మనం వొదిలే విషవాయువుల్లో వారు జీవించలేరు. వెళ్దాం — పా — శ్రీధర్ !

శ్రీధ:— వెళ్దాం—

[ఇద్దరూ చేతులుపట్టుకొని వెళ్ళిపొయ్యారు]

రావు:— రాజా కూడా మనను వొదిలి వెళ్ళాడా? కృతఘ్నుడు!

సుంద:— ఔను.........తండ్రిని పోలిన కొడుకు!

రావు:— (తలను రెండు చేతుల్తోనూ నొక్కుకొని) జయ ఇంకా నొప్పులు పడుతూన్న ట్టనిపిస్తోంది. దూరాన, సన్నగా, బాధగా, జాలిగా ఏడుస్తూన్నట్టు వినిపిస్తోంది. ఇంత గాలివాన గోలలో, ఆ రోదనం ఏలా వినిపిస్తోందో అర్థమవటంలేదు—

సుంద:— వినిపిస్తోందా? పవిత్రమైన యీ గట్టి గోడల్నీ. మీ వజ్ర హృదయాన్నీ దూసుకు రాగలుగుతోందా? (వికటంగా నవ్వి) వాళ్ళిద్దరూ మీకు విధించిన యావజ్జీవ శిక్ష! గాలివానలోనే కాదు....ఈ ఒక్కరాత్రే కాదు.... మీ జన్మంతా ఆ రోదన వినిపిస్తూనే వుంటుంది. ఆ శబ్దం అతి భయానకం! అది క్షణ క్షణానికీ వికృతంగా మారుతూంటుంది. మీ అంతరాత్మలో అది చేసే గోలా, కల్పించే భూకంపమూ, ఏ సముద్ర ఘోషకూ తీసిపోని ధ్వనీ - మీ అంత్య క్షణాల వరకే కాక, పరలోకాల్లో కూడా మిమ్మ వొదలదు! ఇక మీకు శాంతిలేదు! శిక్ష....బలే శిక్ష!

[వికటంగా నవ్వి వెళ్లి పొయ్యేందుకు లేచి నిలబడ్డది]

రావు:— వెళ్ళ వోక - నాకు ఒక్కడికీ భయంగా వుంది.

సుంద:— మీ భయం యీ జన్మానికి పోదు.

[బైట ఉరిమిన శబ్దం]

రావు:— అబ్బ!....జయ ఏడుస్తోంది....జయ ఏడుస్తోంది!

సుంద:— ఔను. ఆమె మృతికి యీ ప్రకృతే ఘోషిస్తోంది. ఈ ఉరుములే దాని రోదన ధ్వని! ఈ మెరువులే కాంతి వంతమైన దాని కళ్ళనుంచి వొచ్చే దీన దృక్కులు! రివ్వు రివ్వున వీచే యీ పెనుగాలే - దాని శీతలాత్మ విడిచే నిట్టూర్పు గాడ్పులు! ఈ వానే దాని కన్నీరు!

[సుందరమ్మ వెళ్లి పోయింది. రావుబహద్దూర్ యీ బాధనూ, భయాన్నీ మరిచి పోదామని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. ఇది వ్యర్థ ప్రయత్నమని వెంటనే గ్రహించి, గత్యంతరం లేక, క్రమంగా కుర్చీలో ముడుచుకొని పొయ్యాడు]

—♦ తెర ♦—

ఐ పో యిం ది



Kalyan. Press, Tenali Q. H. No. G 79 A Copies. 1000 8-4-46
for Sundara Ram & Sons, Tenali—Q. H. G. 2

"ధనికొండ" రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| కాముకి | .... | (కథలు) | .... | 1–0–0 |
| తీర్పు | .... | (కథలు-నాటికలు) | .... | 1–4–0 |
| ఇలవేల్పు | .... | (నవల) | ... | 1–0–0 |
| లోకచరిత్ర | .... | " | ... | 1–4–0 |
| ప్రియురాలు | .... | (కథలు) | .... | 1–0–0 |
| గర్వభంగం | .... | " | .... | 1–0–0 |
| సంజీవి | .... | " | .... | 1–0–0 |
| పవిత్రులు | .... | (నాటకం) | .... | 1–4–0 |

పోస్టేజి ప్రత్యేకం

రు 6/= విలువగల పుస్తకాలు ఒకేసారి
తెప్పించే వారికి మాత్రం పోస్టేజి లేదు.

త్వరలో రానున్నవి

| | | |
|---|---|---|
| జ్ఞాని | ... | (కథలు) |
| ఏకాకి | .... | (నవల) |
| ఎర్రబుట్టలు | .... | (నాటికలు) |